కయియ్యకోలునన్'' హరి. ఉ.౭. ఆ:
ఇయ్యకొను, ఈకొను, ఈయకొను, ఒడఁబడు, ఒప్పుకొను, కొలుపు, డిందుపడు, నూలుకొను, మెయికొను.

ఇచ్చగింత.శ.వై (సమ్మతి, అంగీకారము) ఇప్పికోలు, ఇయ్యకోలు, ఈకోలు, ఈయకోలు, ఊంకు, ఒడఁబడిక, ఒడఁబాటు, ఒప్పికోలు, ఒప్పు, ఒప్పుకోలు, కయికోలు, కైకోలు, సుంజూసు, మయికోలు, మయివడి, మెయికోలు, మెయివడి, మేకోలు, మేకుడు, మేమును, మెకోలు, మైవడి, లాగు, సమకోలు, సమానము.

ఇచ్చగొండి.శ.వై. చూ, ఇచ్చకొలమారి.

ఇచ్చటన్.భా.౩.౬౬.అవ్య.చూ, ఇందున్.

ఇచ్చనుండువాఁడు.పా. చూ, అడ్డము లేనివాఁడు.

ఇచ్చిపుచ్చుకోలు-శ (ఇచ్చిపుచ్చుకొనుట)

ఇచటు.శ.స.ఏ. (ఈస్థానము) ఇచొటు, ఇచ్చటు, ఇచ్చోటు, ఇచ్చోటు.

ఇచొటు.శ.స.ఏ—పై—

ఇచ్చటు.శ.స.ఏ—పై—

ఇచ్చోటు.శ.స.ఏ—పై—

ఇచ్చోటు.శ.స.ఏ —పై—

ఇచ్చు.శ.స.క్రి (దానము చేయు) చూ, రాఅచ్చు. [త్తువ.

ఇజారా.చం.గ్రా (గుత్త) గుత్త, గుత్తగ, గు

ఇజారు.శ.గ్రా (కాలికి తొడిగికొనుచట్టు) హిజారు.

ఇజుకు.1.శ (సంకటము) చూ, అనుకు.

2.శ (శ్రమము) చూ, అతలకుతలము.

ఇట.శ.ఏ (ఇక్కడ) వాఁడిటవచ్చువాఁడో యేసంవలకేగుదానన్నో,, భారి.ఆర.౨౯ఆ:

ఇటన్.శ.అవ్య.(ఈవల) [టమీఁదన్

ఇటఁబట్టు.శ.అవ్య. (ఇది మొదలుకొని) ఇ

ఇటమీఁదట.శ.అవ్య.—పై—

ఇటుక.పా.వై=(ఇష్టకా, బంకమట్టితోఁ కాలవేసినతాయి) ఇటిక, ఇటికె, ఇటుక, ఇట్టిక, ఇట్టుక

ఇటిక.శ.వై=—పై— [డము.

ఇటికపగడము.శ.వై (కృత్తిక, మట్టిపగ

ఇటికె.శ.వై. చూ, ఇటుక.

ఇటు.శ.అవ్య. (ఏవమర్థకము) ఇటులు, ఇటువలెన్, ఇట్టు, ఇట్టులు, ఇట్టువోలెన్, ఇటు.

ఇటుక.భా.౩.౭౯. చూ, ఇటుక

ఇటులు.శ.అవ్య.చూ, ఇటు.

ఇటువంటి.శ.విశ (ఇట్టి) '' కాగాదిటువంటి పల్కనక'' కళా.౩.ఆ: ఇట్టి

ఇటువలెన్.శ.అవ్య.చూ, ఇటు.'' ఇటువలె వెదకెను'' రామా.౬.ఆ:

ఇట్టలము.1. పా (దృఢము) ఉక్కు, ఊసుటు, ఊదెరి, ఊటిది, ఊటు, ఒఱపు, కటికి, కొదమ, గట్టి, చేగ, చేవ, తిరపు, దిటము, దిటవు, దిట్ట, నేటు, పదిలము, బటువు, బిగి, బిగితము, బిగువు, బిట్టు, బిఱ్ఱు, బెట్టిదము, రుటము, సదాటు.

2.శ (అధికము) చూ, ౪అంకపొంకములు. ''ఇట్టలముగఁ దగిలినట్టి యెఱ్ఱలువోలెన్'' స్వా.౪.ఆ:

3.పా (స్థిరము) ఇరవు, ఊటిది, జితము, స్థిరము, పొలుపు, పొల్పు.

ఇట్టి.శ.విశ.చూ, ఇటువంటి.

ఇట్టిక.శ.వై=(ఇష్టకా) చూ, ఇటుక

ఇట్టు.శ.అవ్య.చూ, ఇటు.

ఇట్టులు.శ.అవ్య—పై—

ఇట్టువోలెన్.శ.అవ్య—పై—

ఇట్టుక.పా.వై.చూ, ఇటుక.

ఇట్టుపు.ప.౬.౯౨. (అజశృంగి*) జట్టుపు, నుట్టుపు, దుట్టుపు.

ఇట్లు.1.శ.అవ్య. చూ, ఇటు.

2.శ.అప (ఇఁక మీఁద జెప్పఁబోవు ప్రకారము) ''ధర్మజానకురోమతుండిట్లనియెన్''

ఇడి.శ.(పేలికాభత్త్యము) పేవ,పేడియ,పేవె
ఇడుకుపక.శ(భత్త్యవిశేషము) చూ,అంగ రొల్లైలు. [యు.
ఇడియు.శ.అ.క్రి(భేదిలు) చూ, ఇండెవా
ఇడు.1.శ.స.క్రి(దానముచేయు) చూ,౫అ మ్బ్.2—(ఉనుచు)
ఇడుగడ.1.శ (గుణములయందుదోషమునా రోపించుట, అసూయ) "చ.తడయక మెుక్కియున్న వినతా సుతునప్పుడు సూచియాత్మలో, నిడుగడసేయుచుకా గడుసహింపక,,భార.ఆది.౨.ఆ:
2.శ(హీనత్వము)"చ.మై, నిడుగడసే యఁ గావలయు నీలువు మాలినయంకు టాండ్రకున్"విజ్ఞా.ఆచా.కాం. (ఇది ఇంకనువిచార్యము)
ఇడుపు.1.పా(పార్శ్వము)చూ,౧.అంక" పాడువుగుబ్బలి నేలపురుటింటియిడుపు నజతిచినగండపుఁజీటలనఁగ"పా.హ.
2.శ (గోడయిరుపార్శ్వములమీఁదిచో టు) "గీ. దా రు వ న వీ థి శీ తాంశుధరునిరంతు,శౌరిగోపాలకామి నీచార్యకేళి,కామరసభావములు మించి కానఁ బడఁగఁ, దీర్చియిడుపులయం దుఁజిత్రించినారు" సై.౩. ఆ:పాదిక టు.
3.శ(చీలిక.ఖండము)చూ,౧. అరవర లు"ఇడివినయిడుపులరొుడల,,అము.౬ ఆ:
ఇడుమ.1.శ(ఆపద)చూ,౨అంకిలి"గీ.మగు వఁగోలోప్పయిక డునిడుమలఁ గలంగు,, అచ్చ.సుం కాం.
2.పా(కష్టము)చూ,౨.అగచాటు.
3.శ(దుఃఖము)చూ,౫అంగద"గీ.విప్ర వరులుభోగములకు పెట్టు సేయ,కడుమ లిహమునఁ బడికొంతు కలిమిఁబరము, నందుసుఖము,,మార్క.శ.ఆ:

ఇడుమపాటు.శ(ఇడుమపడుట)
ఇడుమూడి.పా(కష్టము)చూ,౨అగచాటు.
ఇడ్డెన.శ(భత్త్యవిశేషము)చూ,అంగరొల్లె లు.
ఇతఁడు.శ.స.ఏ(ఈపూజ్యుఁడు) ఈతఁడు, ఈయన.
ఇతకరి.శ.వై=(హితకారి)
ఇతము.శ.వై=(హితమ్)"ఎ.గీ.పలుపలుకు లేలఇంక నా చెలులుగిలులు, నేగుదెంచి విన్న మెునర్తురితమెుఱఁగక" (ఇత ము= ఇతమైనకార్యమని యర్థము) క ళా.౩.ఆ:ఇతవు,హితవు.
ఇతవరి.శ(హితముచెప్పువాఁడు) హితవరి.
ఇతవు.శ.వై=(హితమ్)చూ,ఇతము.
ఇతవుఁడు.శ.వై=(హితుఁడు)
ఇత్తడి.శ.వై= (పిత్తళమ్.అరకూటము)ఇ త్తళి,పిత్తడి,పిత్తళి.
ఇత్తళి.శ.వై=—పై—
ఇత్తఱి.పా(ఈసమయము)
ఇత్తిగ.1.భా.౨.౩౦౬.స.చూ,౧.అటు.
2.శ(పాచికలమీఁదిమూడుబొట్లజత, దుందుభి)ఇద్దుగ. [ది,ఈయది.
ఇది.పా.స(ఏతచ్ఛబ్దార్థకము) ఇద్ది,ఇయ్య
ఇదిగోన్.శ.అవ్య.చూ,ఇగోన్.
ఇదిగో౼.శ.అవ్య.—పై—
ఇదికదా.పా.అవ్య(ఇదియేకదా)
ఇదియ.పా.అవ్య.చూ,ఇగోన్.
ఇదె.పా.అవ్య—పై—
ఇద్దరి.పా(అపారము)ఇవతల,ఇవల,ఇవ్వ ల,ఈతల,ఈవల.
ఇద్దఱు.శ.స (రెండుశబ్దమునకుమహన్మహ ర్థకబహువచనాదేశము) ఇరుగురు,ఇరు వురు,ఇర్వురు.
ఇద్ది.శ.స. చూ,ఇది.
ఇద్దరుతల్లులముద్దుబిడ్డఁడు.అం.౧.౧౨(వినా యకుఁడు)ఏనుఁగుమోముసామి, ఒంటె

కొమ్ము వేలుపు, కలుగులోతు ఊరు తేజిబ ఆసిపోయి, నుదుములతిండి కాడు, కొమ్మురవుతు, కొమ్మురౌతు, కోడెకెక్కుమువానన్న, గరికపూజల మెచ్చుగబ్బివేల్పు, గుంజిల్లుపెట్టించుకొను వేల్పు, గుజ్జువేలుపు, గొప్పబొజ్జగలాడు, గొప్పమెయిప్రోడ, చేటచెవులవేలుపు, చేటవీనులదణి, టెంగణాసామి, పగడపంటిదొర, పనిచెఱుచువాడు, పనిచెఱుపువేల్పు, పాపజందెముల మేటి, పాపజన్నిగట్టు, పిళ్లారి, పెద్దకడుపు వేల్పు, బొబ్బికడుపువేల్పు, బొజ్జదేవర, ముక్కంటితొలిపట్టి, ముక్కంటిపందుల మెక్కుడుదిండీడు, మొదటివేలుపు, మోట్టికాయల మెప్పు, మ్రొక్కువారల పనుల్ జక్కజేసెడుసామి, వంకర తొండంబువాడు, వెనకయ్య.

ఇద్దుగ.శ. స.చూ,౨.ఇత్తిగ.

ఇద్దుము.శ(రెండుతూములు) ఇరుదూము.

ఇద్దెస.పా(ఈవైపు) ఈకడ.

ఇని.శ.స.ఏ (ఇంతశబ్దమునకు బహువచనాదేశము)ఇన్ని.

ఇను.శ.స(వృత్తియందు హల్లుపరగుచో రెంటికాదేశము గానచ్చునది) "ఇనుమాఱు", మొ. [లు.

ఇనుప.శ(తుషయుక్తాల్పధాన్యము) చింక

ఇనుపకచ్ఛడము.1.పా (ఇంద్రియనిగ్రహత్వము) [ట్టుకొన్న,,

2.పా(ఇనుపగోచి) "ఇనుపకచ్చడాల్ల

ఇనుపగోలెము.వెం.ఉ.౨. (అంగారధానిక) కమటము,కమ్మటము,కుంపటి,కుమురు, బంగల,వయ్యంది.

ఇనుపచిట్టెము.పా(మండూరము)

ఇనుపగుండులు. పా (తలుపుబందులకాధారమైనది). [లు.

ఇనుపతేలు.శ(కృష్ణవృశ్చికము) ఎనుపతే

ఇనుపదుడ్డు.పా(ముద్గరము) గుదుప, గుదియ,గుదె,గుదుపయు,దుడ్డు.

ఇనుమడి.శ.స(ద్విగుణము)ఇన్మడి, ఇబ్బడి, ఇమ్మడి, జంట, జమిడి, జమిలి, దంట, దుగ, దుగణము, దువ, రెట్టి.

ఇనుమడించు.శ.స.క్రి (ద్విగుణించు) ఇన్మడించు,ఇబ్బడించు,ఇమ్మడించు, రెట్టించు. [మద్ది.

ఇనుమద్ది.శ(అశ్వకర్ణము*)ఏపెచెట్టు, నల్ల

ఇనుమునుమడు.శ(ప్రపౌత్రుడు)

ఇనుమనుమరాలు.పా(ప్రపౌత్రిక)

ఇనుమారు.పా(రెండుపర్యాయములు)

ఇనుమిక్కిలి.శ(అత్యధికము)

ఇనుము.శ(అయస్సు)ఇన్ము,ఉలి.

ఇన్ని 1.శ.స.ఏ.చూ,ఇని.

2—(ఈసమస్తము)

3—(ఇంతసంఖ్యకలవి)

ఇన్నుగ.పా.చూ,ఇంగుగు*. [లు.

ఇన్నూరు.పా.స(రెండునూఱులు) ఇన్నూ

ఇన్నూఱు.శ.స—పై—

ఇన్మడి.శ.చూ,ఇనుమడి.

ఇన్మడించు.శ.స.క్రి.చూ.ఇనుమడించు.

ఇన్ము.పా.చూ,ఇనుము.

ఇపుడు.శ.ఏ(ఈకాలము) ఇప్డు,ఇప్పుడు.

ఇప్డు.శ.ఏ—పై—

ఇప్ప.శ(మధూకము*)

ఇప్పటిది.పా (సద్యఃకాలసంబంధమైనది)

ఇప్పకట్టె.పా(మధూకదారువు)

ఇప్పనూనె.పా(మధూకబీజతైలము)

ఇప్పపూరాజనములు.శ.బ(శాలిధాన్యవిశేషము)చూ,అక్కుళ్లు. [ఈలాగు.

ఇప్పాటు.పా(ఈప్రకారము) ఇమ్మెయి,

ఇప్పిగోలు.గ్రా.౧.౧౦౪ (సమ్మతి)చూ,ఇచ్చగింత.

ఇప్పుడు.శ.ఏ.చూ,ఇపుడు.

ఇబ్బంది1.పా(అశుభము)చూ,3అటు.
2.పా(కష్టము)చూ,౨అగచాటు.
3.శ(మిక్కిలినిర్బంధము) [పంది)
4.శ (అడవిపందికినిఊరఁబందికినిపుట్టిన
ఇబ్బందిగాఁడు.శ(భల్లూకము) ఎలుఁగు,ఎలుఁగుగొడ్డు, ఎలుఁగుబంటి,ఎలుఁగుమంటి,ఎలువు, ఎల్గు,ఎల్లువెలినోటిమెకము, పుట్టకొఁపు, పుట్టకూటిమెకము, పుట్టకూడుదిండి,పుట్టకూడుమెక్కుమెకము, బొచ్చుమెకము, బొల్లిమోరమెకము, మొగముతెలుపుమెకము,లేడు, వెనుకచూపులమెకము, వెనుచూపులమెకము, వెలినోటిమెకము, వెలుఁగుబంటి.
ఇబ్బడి.శ.చూ,ఇనుమడి.
ఇబ్బడించు.శ.స.క్రి.చూ.ఇనుమడించు.
ఇబ్బెద.శ (వృక్షవిశేషము) [ము.
ఇమిడిక.1.శ (అంతర్భూతము) చూ,అడక
2.శ (పొందిక,మైత్రి)చూ, 3అంటు.
ఇముకలము.ప.౨.౧౧౫ (లేఖిని) కలపకట్టియ,కలపకట్టె,కలము,పేనా.
ఇముడు.1.శ.స.క్రి. చూ,అడగారు.
2—(అనుకూలమగు) చూ,ఆవటిల్లు.
ఇముడుకొను.శ.అం.ప్రే (ఇముడ్చుకొను)
ఇముడుచు.శ.ప్రే (ఇముడఁజేయు) ఇముడ్చు.
ఇముడ్చు.శ.ప్రే—పై—
ఇమ్మడి.శ.చూ,ఇనుమడి.
ఇమ్మడించు.శ.స.క్రి.చూ,ఇనుమడించు.
ఇమ్ము.1.శ (సుఖము)" ఇమ్ములనున్నవాఁడెవారి,,భాగ.౧౦.స్కం.పూ(ఈయర్థమందుయిదితఱచుగాద్వితీయా బహువచనాంతముగానే ప్రయోగములయందుగానఁబడుచున్నది) ఉసులు, పదిలము, పొఁడిమి,పొఁణిమి, బులుపు,భోగము,వసతి,సుకము,సుఖులు,సుగము, సుమాళము,సొంపు,సౌఖ్యపాంయి.

2.పా(గృహము)చూ,౧ఇక్క.
3.శ(స్థానము) చూ,౨ఇక్క."ఎ.గీ.అతుల ధైర్యంబునకునీమహాత్ముఁ డిమ్ము,, ఉ.రా.౫.ఆ:
4.శ(విరివి,విశాలము)"చ-పురం, బునకిచటిమ్ము చాలదనుబుద్ధి జనించెగణించిచూడుమా"హరి.ఉ.౨.ఆ:ఒడ్డు, గరుము,తనరుపు,తనర్పు,సెరవు, నెఱపు, పరపు,పఱపు,బాకి,పిరళి,విరివి,విరివిడి, విఱివి,వెడఁద,పెడఁద.
5.శ(మనోజ్ఞము) చూ,౨ అందము"వ.మనుష్యమాంసంబుఁదెచ్చియిమ్ముగావండిపెట్టిన,,భార.ఆది.౭.ఆ:
6.శ (అనుకూలము) "వ.విచారపూర్వారబ్ధకార్యంబునకు దైవంబునునకుకూలంబగుంగావున నిమ్ముగా విచారింపవలయు,,భార.ఆది.౧ఆ:
7.శ(మైత్రి) చూ, 3అంటు"క. తనకిమ్మగునంతకుదు,ర్జనుఁడిష్టుఁడపోలెనుండిసర్పమువోలెఁదనకిమ్మగుడును గఱచును, ఘనదారుణకర్మగరళఘనదంష్ట్రిలచేఁ,,భార.ఆది.౬.ఆ:
8.శ(ఇంపు) చూ, ౧. ఆరజము." ఉద్యోగపర్వమిమ్మగుసభలఁ,, భార.ఆది.౧.ఆ:
9.శ (ఉపాయము) చూ,౨అనువు." క. ఇమ్మెఱుఁగనియట్టివారలిభపురనాథా,,భార.ఉద్యో.౨.ఆ:
10.శ (అనుకూలము) చూ, ౨అనుగలము."గీ.ఎత్తికొనిచనంగనిమ్మగున్నట్లుగా,మెదలుచున్నప్రయ్యాలదిమిరెంటిఁ, గూడఁబెట్టె,,భార.సభా.౧.ఆ:
11.శ(యుక్తము)చూ,౪.అనువు"వ.ఇమ్మగునవసరంబున,, భార.ఆది.౬.ఆ:
12.శ(స్పష్టము)"గీ.మహీవల్లభుండయిననిమ్ముగఁజూచితి,భార.ఆది.౫.ఆ:

ఇమ్మగొను.శ.అ.క్రి(వసించు) ఉండు,కాపురిండు,నడగొట్టు,నిలుచు, నిల్చు,వేంచేయు
ఇమ్ముడప్పు.శ(సంకటము) చూ,ఆనవు
ఇమ్మెయి.1.పా (ఈప్రకారము) చూ,ఇప్పాట
2.పా(ఈశరీరము) [క్క-ఱ
ఇయ్య.శ.వై=(ఈవా.అపేక్ష) చూ,౧.అ
ఇయ్యకొను.శ.స.క్రి(సమ్మతించు) చూ,౨ ఇచ్ఛగించు
ఇయ్యకోలు.శ(సమ్మతి) చూ,ఇచ్ఛగింత
ఇయ్యది.శ.స చూ,ఇది
ఇయ్యనేయు.శ.వై.అ.క్రి(సమ్మతించు)
ఇయ్యెడన్.శ.అవ్య (అత్రార్థకము) చూ, ఇందక [ము)ఈయేఁడు-
ఇర్యేఁడు. ప .౧.౫౧ (వర్తమానవత్సర
ఇరవారు.శ.అ.క్రి (స్థిరపడు) ఇరవుకొను, ఇరవుపడు, కుదురు,కుదురుపడు, కుదుర్పడు,జితపడు, జితించు, డెక్కొను, తావుకొను, తిరపడు, వాటుకొను,నెక్కొను,నెట్టుకొను, నెలకొను, నెలవుకొను,పదిలపడు,పాదుకొను, పొందుకొను,పొలుచు
ఇరవు.1.పా(గృహము)చూ,౧ఇక్క
2.శ(స్థానము)చూ,౨ఇక్క
3.శ(స్థిరము)చూ,౩ఇట్టలము"క. ఇరవుసిద్ధించుననఘ ఇహపరసుఖముల్,, భార.ఆర.౪.ఆ: [వారు
ఇరవుకొను.1.శ.అ.క్రి(స్థిరపడు) చూ,ఇర
2–(నెలకొను,నిలుచు)ఇరవుపడు,కుదురుకొను,కుదురుపడు, కుదుర్పడు, నట్టుకొను,నిలఁబడు,నిలుచు, నిలుచుండు,నిలుచుకొను,నిలువఁబడు, నిల్చు,నిల్చుండు,నిల్వఁబడు, నూలుకొను, నూల్కొను, నెక్కొను, నెప్పుకొను, నెలకొను, నెలవుకొను,పట్టుకొను, పాదుకొను, పాదునిలుచు,మట్టుకొను, మట్టుపడు
ఇరవుపడు.శ.అ.క్రి —పై—
ఇరవుపట్టు.పా(గృహము)చూ,౧ఇక్క
ఇరస.పా(రెండుకుంచములు)ఇరుస
ఇరాలు.శ.స.(ద్వాదశసంఖ్య) ఈరాలు, నల్గిగ,పంౘ్రెండు,పదిరెండు,బార,బారా,ముచ్చాకము
ఇరివిరి.పా.పొగర.
ఇరు.పా.స(ద్విసంఖ్య) ఇరు,ఈరు,జంట, దంట,దుగ,దువ,రెంచ,రెంట, రెండు
ఇరుకెలఁకులు.పా.బ (ఉభయపార్శ్వము లు)ఇరుగడలు, ఇరుగెలఁకులు, ఇరుచక్కియలు,ఇరుదెసలు,ఇరుపక్కియలు, ఇరుప్రక్కలు, ఇరుబగులు, ఇరుమయిలు, ఇరుమెయిలు, ఇరుమేరలు, ఇరువంకలు, నూరెలు
ఇరుగడలు.పా.బ—పై— [గు
ఇరుగు.1.శ (ప్రక్కయిల్లు) ఇరువు, పొరు
2.శ(పార్శ్వము)చూ, ౧.అంక"క.ఇరుచెవిరొయుఁగకయుండక,, ఉ.హరి.౫.ఆ: (దీనికిప్పృత్తి యందంత్యవర్ణలోపము) [నము.
ఇరుగుడు.శ(శింశుప*)ఇరువుడు,నల్లదిరిసె
ఇరుగురు.శ.స.చూ, ఇద్దఱు
ఇరుగెలఁకులు.పా.బ.చూ, ఇరుకెలఁకులు.
ఇరుచక్కియలు.పా.బ —పై—
ఇరుచాలుమక్కి.పా (రెండుచాళ్లుమన్నినమక్కి)
ఇరుతిగ.పా.స.చూ,౧అలు
ఇరుదంతి .ప.౫.ర (దంతావళము, ఏనుఁగు)చూ,౨.అత్తి [త్రాడి
ఇరుదలతేజి.వెం.గా.౨(మేషము)చూ,అగ్గిత
ఇరుదలపాము.పా(రాజిలము)పూఁడుఁబాము.
ఇరుఁ దలపులుఁగు.శ (గండభేరుండము)ఇరువాయిపక్కి,ఏనుఁగులదిండి.

ఇరుదూము.పా. చూ,ఇద్దుము

ఇరుదెసలు.పా.బ. చూ,ఇరుకెలఁకులు

ఇరునాలుగు.పా.స (అష్టసంఖ్య) ఎనిమిది, ఎన్మిది,దచ్చ్యుక,దచ్చి

ఇరుపక్కియలు.పా.బ.చూ,ఇరుకెలఁకులు

ఇరుపరువునేల.పా (క్రోశద్వయము) ఇరుపర్వునేల

ఇరుపర్వునేల.భా.౨.౮ —పై—

ఇరుపలము.పా (ద్విపలి) ఇర్పలము,ఇల్లము

ఇరుపేద. పా (అతిదరిద్రుఁడు) నిరుపేద

ఇరుప్రక్కలు.పా.బ. చూ,ఇరుకెలఁకులు

ఇరుబగులు. ప.౧.౫౬ —పై—

ఇరుఁబుట్టువు.1.శ (బ్రాహ్మణుఁడు) చూ, ౧.అయ్యవారు

2.శ (పక్షి) గువ్వ, గ్రుడ్డుకానుపు, పక్కి,పిట్ట, పులుఁగు, పెట్ట [లు

ఇరుమయిలు.భా.౩.౨౫. చూ,ఇరుకెలఁకు

ఇరుమూడు.పా.స.చూ,౧ ఆఱు

ఇరుమెయిలు.1. పా. చూ, ఇరుకెలఁకులు

2.పా (రెండు మేఘములు)

ఇరుమేలు.ప.౧.౫౬.చూ, ఇరుకెలఁకులు

ఇరులు.శ (అంధకారము) కప్పు,చీఁకటి,చీకువాలు,ముబ్బు, మయిల, మైల

ఇరులుకొను.శ.అ. క్రి (చీఁకటిపడు)

ఇరులుగొంగ.శ (సూర్యుఁడు) ఇనముమేపరి,ఇనముసూడు,ఎండదొర, ఎఱ్ఱనివేలుపు, ఏడుగుఱ్ఱముల తేరెక్కుజోదు, కలఁజావరుల తెన్ను, కలువలదాయ,కలువలసూడు, కాఁకవెలుఁగు, కెంపురాగాముల ఱేఁడు,చదలుమానికము,చలిదాయ, చాయపెనిమిటి, చాయమగఁడు, చీఁకటిగుండెదిగులు, చీఁకటిగొంగ,చీఁకటులగొంగ, చెయువులసాకిరి, జక్కవలయంటు, జక్కవల ఱేఁడు,జగముకన్ను, జగముచుట్టము, జముతండ్రి,జమునయ్య,తమ్మిచక్కిలిగింత, తమ్మిచుట్టము, తమ్మిదొర, తమ్మివాల్గంటిమగఁడు,తమ్ములవిందు,తామరచెలి,తొగకొమ్మతొలఁగుబావ,తొగసూఁడు, దుగపదిరూపులదండగీఁడు, నెలజోఁడు, పగటిజోతి,పగటివేలుపు, పగటివేల్పు, పగలింటిదొర, పగలుసేయువలంతి, పచ్చగుఱ్ఱముగలాఁడు, పచ్చవారువపుజోదు,పచ్చవార్వపుజోదు, పనులసాకిరి, పొంజక్కసామి, పొద్దు,ప్రాఁజదువులపెట్టియ, ప్రాఁబలుకుల టెంకి, ప్రాఁబల్కుసొమ్ముపెట్టె,ప్రొద్దు,బారమేనుల ప్రోడ, బార రూపుల వేలుపు, మింటితెరువరి,మినుకులబరణి, మినుకులయిక్క, ముప్పొసవాల్గీము, మువ్వన్నెకాఁడు, మువ్వేలుపులయిక్క, మొక్కసొక్కసామి,మొదలిగాము, మ్రొక్కులాసగలంతి, రేకంటు, రేవెల్గుజోదు,వినుకెంపు,వినుఁతనము, వెన్నునిపలకన్ను, వెన్నునిపలచూపు, వెలుఁగుఱేఁడు, వేఁడివెలుఁగు,వేఁడివేలుపు,వేయిచేతులదిట్ట,వేవెలుఁగు, వేవెల్గు, సతహామూదణి,సయితుఁడు,సెకవెలుఁగు.

ఇరువంకలు.పా.బ.చూ, ఇరుకెలఁకులు.

ఇరువంద్రు.శ.స (ఇరువదిమంది)

ఇరువది.శ.స (వింశతి) ఇరువయి,ఇర్వది.

ఇరువయి .శ.స—పై—" ఇరువైనాలుగుమూళ్ల మేర,, కాశీ.౧.ఆ:

ఇరువాఁగు.పా (ఉభయసేన) [ము)

ఇరువాయికట్టు.శ (మలమూత్రబంధరోగ

ఇరువాయిపక్కి.శ (గండభేరుండము) చూ, ఇరుఁదలపులుఁగు

ఇరువు.1.శ (ప్రక్కయిల్లు) చూ,౧. ఇరుగు

2.శ (పార్శ్వము) చూ,౧.అంక.

౩.శ (స్థానము) చూ,౨.ఇక్క "సీ. నెలనీటికిరువుపన్నిటిచెలువు,, శకాం.౪ఆ

ఇరువుడు.శ.చూ, ఇరుగుడు*.

ఇరువురు.శ.స.చూ,ఇద్దఱు.
ఇరుస.శ.చూ,ఇరస.
ఇరుసు.1.శ(రథాక్షము) [వ్యు]
2.శ (ఏతపుమ్రానిక్రిందినడిమియడ్డుకో
ఇర్తిగ.పా.స.చూ, ౧౮ఱు.
ఇర్పలము.పా.చూ,ఇరుపలము.
ఇర్వది.శ.స.చూ, ఇరువది.
ఇర్వురు.పా.స.చూ,ఇద్దఱు.
ఇఱకటము.పా(సంకటస్థలము) ఇఱుకట
ము,ఇఱుకొటము,ఇఱుకు.
ఇఱీ.శ.విణ. (ఇఱీసినది) "ఇఱీగొను,,
(వ్యస్తప్రయోగముకనుపడదు)
ఇఱీకి.శ (బాలక్రీడావిశేషము) చూ,అం
దలములు
ఇఱీగొను.పా(సూక్ష్మమధ్యము)
ఇఱీయు.1.శ.అ.క్రి(సమీపించు)చూ,అం
టసిల్లు
2—(నలఁగు) ఉక్కు, చదియు, చిది
యు,నలియు,నుగ్గు,ములుగు,మెదుగు,
క్రందు,సదమదమగు
3—(సన్నమగు)కొంచెపడు,వలియు,
సన్నగిలు, సన్నగిల్లు, సన్నవాఱు
ఇఱుకటము. 1.భా.౩. ౨౬ (సంకటము)
చూ,అనరు
2.శ. చూ,ఇఱకటము
ఇఱుకొటము.శ.చూ,ఇఱకటము
ఇఱుకు. 1.శ. —పై— [రోక
2.శ(కోణము)కోన,గొఱీ, గొబ,మూల,
3.శ.అ.క్రి (కొంచెపు తావుననడఁగు)
4—(రెంటిసందునఁజిక్కియదుముదుప
డు)5.శ.అం.ప్రే.(కొంచెపుతావుననడ
చు)6.—(రెంటిసందునజిక్కియదుము)
ఇఱుగుట. ప.౨.౧౧౬ (అపజయము)ఈ
గుట,ఓటమి,ఓటము, ఓటు,ఓడు,ఓ
ల, ఓలచెంగనాలు, చెంగనలు,చెంగ
నాలు,తిరుగు,తిరువు,తిగ్గు, తీలుపడుట,
పొల్లతనము,బన్నము, విఱుగబాటు, వి
ఱుగు,విఱుగుడు,విఱుపు
ఇఱుకుమార్గిను.శ (వెలుఁగు లోపలికిఁబో
వుద్వారమునందుఒక్కొక్క మనుష్యుఁ
డుగాసంకటపడి పోవునట్లుగానాటిన
పంగల గుంజలోనగునది)
ఇఱు ము.శ(మఱు గు,వ్యవధానము)చూ,
౨అడ్డపాటు "వ.ఎడలిఱుములుసంను
ల్కొంధంబులులేకుండనిండి,, భాగ.౮.
స్క౦.
ఇఱుముకొను.శ.అ.క్రి (మఱుగుపడు,తిరో
హితమగు) " ఇఱుముకొనందొడంగెదె
సలేచినచీఁకటిని,, రా.యు.కాం:ఓల
మూసగొను,చాటుపడు, జొడుఁ గు,జొ
ఱుఁగు, డాఁకొను, డాఁగు, డుక్కు,
డొంగు,తొఱు ,దండసిలు,దండసిల్లు,
దాకొఁను,దాఁగు, దాఁగుకొను,దొం
గు,పొంచు,పొరయు, బ్రుంగు,బ్రుంగు
డుపడు, మఱుఁగు,మఱుఁగుపడు,మ
ఱు పడు, మాటువడు, మునుఁగు,ను
న్గు, మొఱఁగు,లాఁచు.
ఇఱ్ఱి.శ (హరిణము) "క.మనసిజరాగంబు
నఁబెనఁగినయిఱ్ఱిని లేడిఁజూచి ,,భార.
ఆది.౫ ఆ: జింక,దుప్పి, నులికొమ్ముల
మెకము, పిఱీకిమెకము, మెకము,మెగ
ము,లేటి,లేడి
ఇఱ్ఱింకలు.శ.బ(మిక్కిలియింకుటలు)
ఇఱ్ఱిగోరజము. శ (మృగనాభి) కస
్తూరివీణియ,జింకపొక్కిలి,మదప
కపుటాము
ఇఱ్ఱియాలు.శ.బ(పార్శ్వము)చూ,౧.అఁ
ఇఱ్ఱిదాల్పుబావ.ప. ౧. ౧౧౮ (విష్ణువు)
చూ, అడుగుచెమ్మటలాఁడు
ఇలకఱచు.శ.స.క్రి (బిగఁబట్టు) ఇల్కఱ
చు,ఈలకఱచు
ఇలకోడి.శ.(ఝిల్లిక) ఈలపురుగు,చిమట

చిమ్మట,చిమ్మిట,చిమ్మెట,రిల్లు.

ఇలవరము. పా (ప్రస్తుతోపయోగకుటీరము)ఇలారము,ఇలువరము,ఇలువారము, నిలువరము, నిలువారము, నిల్వారము.

ఇలాయి.శ. (కరదీపము) చూ, అగ్గిబొడి

ఇలారము.శ. చూ,ఇలవరము

ఇలి.శ(సిక్థము, అన్నముయొక్క కణము) "ఈగకు యిలి పాముకు బలివోరుకదు,, మెతుకు, మెదుకు,రెల్ల.

ఇలింద.పా.వై =(ఇంద్రవల్లీ*) ఇల్లంద, ఇల్లింద.

ఇలు.శ.(గృహము)చూ,౧.ఇక్క

ఇలుకు.శ(కీర్ణనరముల బెణకుట) "నా చెయి ఇలుకుపట్టినది,,

ఇలుగు.శ.అ.క్రి (మరణించు) "క.జలవిక్రమఘనులగువా,రిలిగినమనసేనమేదినీశ్వరవినుక,న్నులుచెడినట్లున్నవి,, భార. శల్య.౧ ఆ: ఈలుగు,ఈల్గు,ఉక్కడంగు, ఉక్కు, ఉక్కుమడంగు,ఏగు,కడగొట్టు,కడచను, కడచు, కడతేఱు,కిల్లు,కూలు,కెడయు,క్రుంగు,గండడంగు, గంతుకొను, గతపడు, గిట్టు,గీటడంగు,గుటుక్కను,చచ్చు,చను, చెల్లు,టెక్కెమెగరగొట్టు, డమ్మను, డింకిరివేయు,డింకు,తీరు, తుదిముట్టు, తెగటాఱు,తెగు,తెరలు,తెఱలు , తేఱు, తొఱగు,త్రుంగు,త్రుళ్లు,త్రెగు,త్రెయ్యు త్రెళ్లు,దోరు,నీలుగు, నీల్గు,పడు, పిలుకుమారు, పిలుకుమాలు,పెద్దనిద్దరవోవు,పొడవడంగు, పొరిమాలు,పొరివోవు,పొలియు,పొలివోవు, పోవు,బిద్దు, బ్రుంగు,మక్కు,మడియు,మడియు,మనుగు, మనువు, మునియు, మునుంగు, మ్రందు,మ్రగ్గు,రూపడంగు,రూపఱు, రూపుమాయు,సచ్చు, సమయు

ఇలుదొర.పా (గృహస్థుడు) చూ,ఇంటికాపు

ఇలునింపుట.పా. (పరిధమునఘూవర్భవనప్రవేశము)ఇలునింపడము,ఇలునింపతము,జంపతి.

ఇలునింపడము.శ—పై—

ఇలునింపతము.ప.౨.౧౦౩—పై—

ఇలుఱేడు.శ(గృహస్థుడు) చూ,ఇంటికాపు.

ఇలువడి.1.శ(కులీనత)ఇల్వడి.

2.శ(మంచినడత) "ఇలువడిసున్నజేసి,,భాగ.౧౦.స్క-౦.పూ:ఇల్వడి.

ఇలువరము.1.శ.చూ,ఇలవరము.

2.శ(తృణముచేనేర్పఱుపఁబడినపుట్టింటిగూడు)ఇలువారము.

ఇలువారము.శ—పై—

ఇలువరుస.1.పా(గృహక్రమము)

2.శ(వంశానుక్రమము)

ఇలువేలుపు.శ(గృహదైవము)

ఇల్కఅచు.శ.స.క్రి.చూ, ఇలకఅచు"పడి పడియానమిల్కఅచి పట్టుచు,, రా.యు.కాం.

ఇల్లంట్రము.శ(శ్వశురగేహాధివాసము)ఇల్లటము,ఇల్లరికము, ఇల్లటికము,ఇల్లాటము. [ద.

ఇల్లంద.పా.వై=(ఇంద్రవల్లీ*) చూ,ఇలింద

ఇల్లటము.శ.చూ,ఇల్లంట్రము.

ఇల్లడ.1.పా (అర్పణము) చూ,అప్పగింత

2.పా(కాపురము)ఇల్లడము,విడిమట్టు

3.పా(రక్షణము)చూ,అద్దికము.

4.శ(న్యాసము)

ఇల్లడము.1.పా(అర్పణము)చూ,అప్పగింత

2.పా.చూ,౨.ఇల్లడ.

3.పా(రక్షణము)చూ,అద్దికము.

ఇల్లము.శ.చూ,ఇరుపలము. [దస.

ఇల్లరి.శ(గృహభాగధేయము) చూ,౨.అ

ఇల్లరికము.పా.చూ,ఇల్లంట్రము.

ఉసుక,క యిసుదుమ్ము. [కము)
ఇసుక దాసరి.శ(ఒకదిసుసుకూర,సైకతశా
ఇసుకదిన్నియ.శ(ఇసుకదిబ్బ)ఇసుకదిన్నె.
ఇసుకదిన్నె.శ—పై— [అంబుపక్కెర.
ఇసుకదొంను.శ (మత్స్యవిశేషము) చూ,
ఇసుకపులకండము.శ(మత్స్యండి)కండ,కం
డచక్కెర,పటికబెల్లము,పులకండము,
పులుకండము.
ఇసుకబేలు.శ(ఒకానొకతీఁగ)
ఇసుక్రమాను.శ(వరుణము*)ఉలిమిడి,ఉలి
మిరి,మావెలఁగ,మొగలింగ.
ఇసుమంత.భా.3.28.అవ్య (ఈషదర్థక
ము) చూ,ఇంచుక.
ఇసుమంతకొఁక.సాం.౧.౨౧(కదుష్ణము)
ఒకింతవేఁడిమి,కనువెచ్చ, గోరువెచ్చ,
గోర్వెచ్చ,తనివెచ్చ,నులివెచ్చ, నులివె
చ్చన.
ఇసుము.శ.ఏ.చూ,ఇసుక.
ఇసులు.సాం.3. ౧౨—పై—
ఇసుళ్లు.శ.బ(పక్షిపల్కికి,ఱెక్కచెదలు)ఉ
సిళ్లు,ఉసుళ్లు.
ఇసువు.శ(సామ్యము)సాత్తు,సొమ్ము.
ఇస్సిరో.1.శ.అవ్య.చూ,ఇసిరో.
2.పా.అవ్య.చూ,౨.ఇసీ.
ఇస్సీ—పై—
ఇహిహీ.1.శ(నవ్వుటయందగుధ్వన్యనుకరణ
ము)చూ ,ఆసురుసురు"ఇహిహీయనిన
వ్వెమదంబుపెంపునన్",,రుక్మి.3.ఆ:
2.శ.అవ్య.చూ, ఇసిరో."క. మగఁటి
మిగలరాచచంద మాయిహిహీ" రా
మా.౫.ఆ:

ఈ

ఈ.ఒకయక్షరము.శ.స (ఎదుటనుండుదా
నిని తెలుపును)"ఈతపము" [దుజాతి)
ఈంద్రప.శ (తాటిచెట్టులోనగువానిగీఁ చె
ఈంద్రము.శ (పీడనము)చూ,అదుముడు.
ఈంద్రవాఁడు.శ(తాళసారగ్రాహి)ఈడిగ,
ఈడిగవాఁడు, గవుండ్లవాఁడు,గౌండ్ల
వాఁడు,చిటిగాఁడు,మొక్కలి. [ట్టు
ఈంద్రించు.శ.స.క్రి (పీడించు)నలఁగుకు వె.
ఈఁక.శ(పక్షియెఱక)ఎఱక,గఱి,చట్టుప,
చెట్టుప,డాఁక,నెఱి, రెక్క, ఱేకు,
లాకి.
ఈకడ.పా.చూ,ఇద్దెస.
ఈఁకు.శ.అ.క్రి(శోషిల్లు)చూ,అడుగంటు.
ఈకరణి.పా(ఈవిధము)
ఈకువ.శ (ఆర్ద్రత,తడి) ఈమిరి, ఊట,చె
మ్మ,చొగగు,తడి,తనుపు,తన్పు, తెమ్మ,
తేమ,తోఁగు, నెమ్ము,పంకెన,పదను.
ఈకె.శ.స(ఈపూజ్యస్త్రీ) ఈపె, ఈమె,
ఈబిడ, ఈబిడె, ఈయమ, ఈయమ్మ.
ఈకెలదారము.పా.(పందెపుకోడిపుంజుల
లోభేదము)చూ,అరజుట్టు [చ్చగించు.
ఈకొను.శ.స.క్రి(సమ్మతించు) చూ,౨.ఇ
ఈకోలు.శ(సమ్మతి)చూ,ఇచ్చగింత.
ఈగడ.శ(జాడ)చూ,ఆచూకి.
ఈఁగ.శ(మక్షిక) ఈఁగె,ఈవ,ఈవె.
ఈఁగపులి.శ(లూతాభేదము)విరిసుపురుగు
ఈగి.1.శ(త్యాగము,దానము) ఈవి,ఒసఁ
గు,చాగము,తెగువ,తేగము,దాక,పుడి
కిరింత,పుడిగ,పుడుకరింత, పుడుకు,పు
డుగ, పుణుకు,పెట్టు,పెట్టుడు, విడు
పు,విడ్పు.
2.పా(చతురుపాయములలోనిదిరెండ
వది)a.మంచి,b.ఈగి,c.వేఱు ,dకొ
ట్టు.
ఈఁగు.1.శ.అ.క్రి(ప్రవేశించు)"క.ఈగం
గాదికతీర్థములీఁ గంగా" పాండు.౧.
ఆ: ఎలయు,ఒలయు, కూరుకొను, కూ
ర్కొను, చొచ్చిలు, చొచ్చిల్లు, చొ
చ్చు,చొత్తెంచు, చొరఁబడు, చొరఁ
బాఱు,తటారించు,తూకొను,తూఱు,

దూయు,దూఱు , నడుచొచ్చు, పాల
ద్రూ,లోఁగు,లోవు.

.శ.స.క్రి(నివర్తిల్లు)" ఎ. గీ.ఎల్లభంగు లమాభంగమీఁ గుమఃభవ,, భాగ. ౬. స్కం:నీఁగు.

ఈగికాఁడు.శ(దాత)ఈవరి,ఈవికాఁడు, చాగకాఁడు,చాగి,తెగుదారి,విడుపరి.

ఈగిమ్రాను.శ(కల్పవృక్షము) ఈవులమ్రాను,కడలికానుపు,జాల్మొలక, తెఱగంటిమ్రాఁకు, తెల్లమ్రాను, పుడుకుమ్రాను,పెట్టుఁజెట్టు,మింటిజెట్టు, మెచ్చులచెట్టు, వాడనిపువ్వుల మ్రాను, వినుమ్రాను,వెలిమ్రాను,వేలుపుఁజెట్టు.

ఈగు.శ.అ.క్రి(వెనుకకొఱగు)చూ,ఇగ్గు" ద్వి.ఈగిదిక్కరులు ఘీంకృతులొనరించెఁ,గ్రాఁగినయసురులగతిని బులింకె'' రా.యు.కాం. పఱుగుట.

ఈగుట.1.ప.౨.౧౧౬(అపజయము)చూ,ఇ

2.పా(పోఁగొట్టుట)

3.పా(ఓర్చుట)

4.పా(ఒదుగుట)

5.పా(డయ్యుట)

6.పా(దూరుట)

ఈఁగె.సాం.౪.౧౩.చూ,ఈఁగ.

ఈచ.1.శ (వక్రము) "ద్వి.కౌలకౌశికుఁడనఁగాఁ బేరువడసి, కొలీచఁ జనుచు'' హరిశ్చ.౨.భా:ఈఱతాఱు, ఏచ, ఏటవాలు,ఏస,ఒరగు,ఒఱగు, ఒఱవ, ఒత్తియ,కొంకర,గోడి,చొక్కిలి, చొట్ట, డొంకు,సెరి,సెటి,సెఱులు,మలఁక,రోటు, వంక, వంకర,వంపు, వక్కరము, వాఁక,సొట్ట.

2.పా(కణిశవృంతము)ఊచ.

3.పా(బలహీనము) [నుసది.

ఈచకొనుసది. పా (అపలోక) ఈచుకొ

ఈచుకొనుసది.భా.౨.౨౬౩—పై—

ఈచపడు.శ.అ.క్రి (వక్రమగు)"గీ.అధిప కొలీచపడఁ గను గ్రాట వులకునరిగి'' పంచ.నా.౧.ఆ:ఈచఁబోవు,గోడివడు, చొక్కిళ్లువోవు,మలఁగు,రోటువోవు, వంకరవోవు.

ఈచఁబోవు.శ.అ.క్రి—పై—

ఈచు.శ.అ.క్రి(శోషిల్లు) చూ, అడుగంటు

ఈచుకపోవు .శ.అ. క్రి (చావుదూడవేయు)

ఈఁజేటి.శ.చూ,ఇంజేటి*.

ఈఁటియ.శ (కుంతము)చూ,అత్తలము.

ఈటు.1.శ (వ్యర్థము)చూ,౫.ఆటమట.

2.శ(శూన్యము)ఉత్త, ఉశిక్కి,ఎద్దడి, కుందేటికొమ్ము,గొడ్డు,చెనఁటి, చెన్నఁటి,దోయిడి, నిప్పచ్చరము,బరిగి, బయలు,బీడు,రిత్త,రుత్త,లేబరము, లొటారము,వట్టి,సోలు.

ఈటువోవు.1.శ.అ.క్రి(వ్యర్థమగు)చూ,౧ ఆఱడిపడు.

2—(శూన్యమగు)

ఈఁటె.శ(కుంతము)చూ,అత్తలము.

ఈఁటెకాఁడు.శ(కొంతికుఁడు)

ఈడ.1.పా(నాగరంగము*) దబ్బ, నారదబ్బ,నారదము,నారింజ.

2.శ(ఈవోటు)

3.శ(పారేవతము*)ఈడె

ఈడన్.భా.౩.౬౬.అవ్య (అత్రార్థకము) చూ,ఇందన్

ఈడఁబోవు.శ.అ.క్రి (అపక్రమించు,వెనుదీయు) చూ, ౧ అయిదుపదిచేయు. "ఈడంబోవక వీఁక మైఁబొడువగా'' భార.ఆది ౧ ఆ

ఈడాడు.శ.స.క్రి (ఎదురు, మార్కొను) "ద్వి. ఓడకోడకు దేవి యుగ్రరాక్షసుని, నీడాడి నీచెఱ నే విడిపింతు''రా.అర.కాం: ఎదిరించు,ఎదురు, ఎదురుకొ

ను,ఎగురుచు,ఎదుర్చు, చెనకు, చెనయు, డీకొను,తలపడు, తొడరు, డాడియాడు,దీకొను,మార్కొను, మాఱు కొను,ముదలకించు, ముదలించు, మెండొడ్డు,రాయు

ఈడిక.1.శ (కంటకాదిభారము) ఊఁచ,ఎఱ్ఱుము,కంప,క్రంప,తొడుగఱ,తొడుగఱ్ఱ,తొడుగు,తొడువు,తొడ్గు,సుడుము
2.శ (తృణాద్యానయన సాధనవిశేషము) చరుగుడు,సరవడి.

ఈడిగ.శ.చూ, ఈండ్రవాఁడు

ఈడిగవాఁడు.శ —పై—

ఈడిగిలఁబడు. శ.అ.క్రి (భయాదులచేరానని మొండి వేసికొనికూర్చుండు) ఈడిగిల్లు,ఈడ్గిలఁబడు

ఈడిగిల్లు.శ.అ.క్రి —పై—

ఈఁడు.శ.అప(కల అనుఅర్థమునందువచ్చెడిఒక ప్రత్యయము) "అగడీఁడు" మొ.

ఈడు.1.శ (ప్రాయము) జవ్వనము,పరువము,ప్రాయము
2.భా.౨.౧౧౭ (యౌవనము) ఈడుప్రాయము, కొమరుఁదనము, కొమరుఁబ్రాయము,గోవ,జవ్వనము, తఱపి,నీరుప్రాయము, పడుచుతనము,పరువము, పర్వు, ప్రాయము
3.ప్రా (అధి) చూ,అగావు
4.శ (సమానము) చూ,౩అనుగలము
5.ప్రా (జీవితకాలము)
6.శ.అ.క్రి (వీడు,చ్యుతమగు) "గీ.శర్ధ్గగలిగిలోకసంగ్రహసంగంబు, నీవవిడిచియెవ్వఁడీయుప్రాయ,ములభజించువాఁడు మోక్షలక్ష్మీపతి, యగునొకింత సందియంబునలదు" భార.అశ్వ.౧ ఆ: ఊరలు,ఊరలుకొను, ఊడు,జాఱు ,వదలు, విడియు, విడివడు, విడివోవు,విడు,విడువడు,విరియఁబడు,విరియఁబాఱు ,విరియు ,వీడు,వీడుకొను, వీడ్కొను,వ్రీలు,సడలు,సగ్గు [చను
7.—(దీర్ఘమగు) చాఁగు, నిగుడు,నిడు
8.శ.స.క్రి (ప్రాలుపిండు) "క.గోవుల కుంగ్రేపుల విడువకయు విడిచి విడిచి యీడకయు,యీడియీడియీడినపాలుకొఁచకయు." భాగ.౧౦. స్కం.
పూ: పిండు,పితుకు,పిదుకు

ఈడుచు.శ.ప్రే (ఆకర్షించు)

ఈడుపడు.శ.అ.క్రి(సమానమగు)

ఈడుప్రాయము.ప్రా.చూ,౨ ఈడు

ఈడుపు.1.శ(ఆకర్షణము)లాగు
2.శ (విలంబనము)
3.ప్రా.(ద్వారపార్శ్వము)

ఈడుపులు.శ.బ(బుగడలగొలుసు) [వు

ఈడుఁబోవు.శే.౧౨.అ.క్రి.చూ,ఈడేఁబో

ఈడుమాఱు.శ.అ.క్రి (వగ్గిల్లు) చూ,౫ఆడరు [మగు

ఈడేఱు .1.శ.అ.క్రి(సిద్ధించు) చూ,౫ఆ
2—(వగల్లు) చూ,౫.అపెరు."కాంత నీడేఱగా.,, మై.౨.ఆ.

ఈడ్గిలఁబడు.శ.అ.క్రి.చూ,ఈడిగిలఁబడు.

ఈడుముంత.శ (ప్రాలుపితుకు మృత్పాత్ర)

ఈడె.శ. చూ,౩.ఈడ*

ఈఁత.1.ప్రా (ఖర్జూరిక*) చూ,ఇంఖి
2.శ.(ఈదుట)
3.శ (పశ్వాదిక ప్రసవము) ఈనిక

ఈఁతకాఁడు.శ. (ఈఁదెడువాఁడు)

ఈఁతకొట్టు.శ.అ.క్రి(ఈఁదు) ఈఁను, ఈఁదులాడు

ఈతఁడు.శ.స.ఏ. చూ,ఇతఁడు

ఈతగాఁడు.శ.స. —పై—

ఈతల.శ (అపారము)చూ,ఇవ్వలి [స.

ఈఁద.1.శ(శీతవాయువు) చూ,అల్లిసెగ్గె
2.ప్రా చూ, ఇందు*.

ఈఁదర.శ.చూ,అల్లితెమ్మెర

ఈఁదాడి.పా.వై.=(హింతాలము*)ఈఁదా
డు,ఈఁదు,గిజికతాడు
ఈఁదాడు.శ.వై.= —పై—
ఈఁను.1.శ.(వాయువు) "క.ఈఁదునకుం
గాదిలికొమరుఁడ." అచ్చ.సుం.కాం:
ఎదచూలి, ఒంటిమ్రాకులపెనుముప్పు,
కరువలి,కర్వలి, గందపుఁగొండతెంకి,
గాడుపు,గాడ్పు,గాలి, చలినట్టు,చలి
యిక్కు, చిలువమేఁత, జింకగుఱ్ఱమువ
లంతి,జింకరవుతు,తావిమోపరి, తెమ్మె
ర,నవ్వగావించుజాణ,నింగిచూలి,నీటి
తాత,నెత్తమ్మికొలనికొఁపు, పయర,ప
యిర,పయ్యర, పాముమేఁత,పైర,బీద
లపెనుపాద,మబ్బుపగ, మబ్బుమేపరి,
మబ్బువిప్పు,మగుతేరు, మింటిచూలి,మి
నుచూలు, వలపుమోపరి,వలి, వినుచూ
లి,విన్నుచూలి,వీవలి, సుడిగొట్టు,సుడి
గొట్టుజాణ,సుర,సురటిపీవనులఁబుట్టు,
సోఁకు,సోఁకుడయ్యము.
2. పా. చూ,ఈఁదాడి.*
3. శ. చూ, ఇందు*.
4.శ.అ.క్రి.చూ,ఈఁతకొట్టు
5.శ.స.క్రి.(దాఁటు,తరించు)ఒడ్డు,కడ
చను,కడచు,కడవెళ్లు, జంగగొను,తటి
యు,దాఁటు
ఈఁదురు.చం.గ్రా.(తుపానుగాలి)
ఈఁదులాడు.1.శ.అ.క్రి.చూ,ఈఁతకొట్టు
2.—(వ్రేలాడు,ఆందోళించు)"ఎ.గీ.
ఈఁకెపోటులఁ బడి ప్రేవులీఁదులా
డ.,,స్వా.ర.ఆ: ఉరియాడు, ఊఁగా
డు,ఊఁగు,ఊఁగులాడు,ఊవాడు,ఊ
పు,తుంపెసలాడు,తూఁగాడు,తూఁగి
యాడు,తూఁగు,దింపులువోవు,బిత్తరిం
చు,వేలు, వ్రేలఁబడు, వ్రేలాడు,వ్రేలి
యాడు,వ్రేలు,వ్రేలుకొను
ఈఁవ.శ.(పత్రినాడి)ఈనియ,ఈనె,పారకి

ఈనము.చం.గ్రా.వై(తక్కువైన,నీచమైన)
ఈనరాసి.చం.గ్రా (పూర్ణముగాఁబండిన
వడ్లరాశి)
ఈనిక. శ. చూ, 3. ఈఁత
ఈనియ. శ. చూ, ఈవ
ఈను.1.శ.స.క్రి (పశ్వాదులుప్రసవించు)
2.— (కలిగించు) "దశదిక్కులుబ్రతి,
ధ్వానములీనఁగా ,,జై.౨.ఆ:
ఈనె.శ.చూ,ఈవ
ఈనెగాజులు.శ.బ. (బాలికాక్రీడావిశేష
ము)చూ,అంజి
ఈపి.శ.(లీక్ష)ఈరు,పేనుగ్రుడ్డు,పేనుపిల్ల
ఈపె.శ.స. చూ,ఈకె [ద
ఈబరి.శ.(అప్రయోజకుఁడు) చూ,అంబే
ఈబరిగొట్టు.శ. —పై—
ఈబిడ. శ. స. చూ, ఈకె
ఈబిడె. పా. స. —పై—
ఈమిరి.శ.(ఆర్ద్రత్వము)చూ,ఈకువ
ఈము. 1.శ.చూ,౨.ఇగము
2.పా (ఒసంగము)
ఈమె.శ.స. చూ, ఈకె [క్కఅ
ఈయ.శ.వై.=(ఈహా,అపేక్ష)చూ,౧.అ
ఈయకొను.శ.స.క్రి. చూ,౨.ఇచ్చగించు.
ఈయకోలు.శ.చూ,ఇచ్చగింత
ఈయది.శ.స. చూ,ఇది
ఈయన.శ.స.ఏ. చూ, ఇతఁడు
ఈయమ.పా.స.చూ, ఈకె
ఈయమ్మ.పా.స.—పై—
ఈయేఁడు.శ.చూ,ఇయ్యేఁడు [కటము
ఈరతార.పా(వ్యత్యయము)చూ,అకటవి
ఈరము.1.శ.(నికుంజము)తీఁగయిల్లు,తీఁగె
యిల్లు,పొద, పొదరిల్లు, పొదరుటిల్లు.
2.భా.౨.3౬.(గుల్మము) ఈరాలు,ఈ
అమి,ఈఅము,గుండు, చెట్టు, జిట్ట,జీ
బు,డొంక,తుప్ప,పుట్ట,పొద,పొదరు.
ఈరస.1.శ.వై.=(ఈర్ష్య, ఓరువలేనితన

ము)ఈరసము,ఈసు, ఊద,ఊసివాస
ము,ఎరుసు,ఓర్వమి, కడుపుమంట, క
డుపూఁద, కనుకుట్టుఁదనము, కొం
తాళము,సూడు. [ములు.
2.శ.వై(కోపము)చూ,౨.అంకపాంక
3.శ.వై(ద్వేషము)చూ,3.అంకపాంక
ములు.
ఈరసము.శ.వై=(ఈర్ష్య)—పై—
ఈరసించు.1.శ.వై.అ.క్రి(ఈర్ష్యపడు)
కొంతాళపడు.
2—(కోపించు)చూ,అచ్చలించు.
3—(ద్వేషించు)ఒడ్డారించు,కంటగిం
చు, పగగొను, మచ్చరించు, మచ్చరికిం
చు,సూడించు,సూడుకొను
ఈరాలు.శ.స. చూ,ఇరాలు .
ఈరాలు.పా.బ. చూ,౨. ఈరము.
ఈరిక.1.పా(శకలము) చూ,౧అరవరలు.
2.శ(అంకురము)చూ,౧ఇగురు.
3.పా(కిసలయము)చూ,౨.ఇరుగు.
ఈరు1.శ(లిక్షు)చూ,ఈపి.
2.పా.చూ,ఇరు.
3.శ (అల్పము)చూ,౨.అన్నువ.
4.శ(హీనము)చూ,౨.ఆలి
ఈరుచు. శ.స. క్రి (ఆకర్షించు) ఈర్చు,
ఒడియు, చేదు, తిగియు, తిగుచు,
తివియు, తీవుచు, తోడుకు, నిమురు,
నుసుము,రెమ్ము.
ఈర్చు.శ.స.క్రి—పై—
ఈరుపెన.శ(లిక్షావికర్షి)ఈర్పెన
ఈరువాలు.శ(విహారము)చూ,అసివాలు.
ఈరువు.శ(మాంసము)చూ,అరుచి
ఈరె.శ(పంటెనుజూటితీసినసూలు)
ఈరెండ.శ(కించిదాతపము)నీరెండ.
ఈరెలుఁగు.శ(హీనకంఠధ్వని)కులుచ,గు
వ్వకుత్తుక,తీఁగయెలుఁగు,తీఁగెయెలుఁ
గు.

ఈరేడు.శ.స(పదునాలుగు)
ఈరేను.శ.స(దశ)ఈరైదు,పది,బంతి..
ఈరైగు.పా.స—పై—
ఈర్పెన.శ.చూ,ఈరుపెన.
ఈలతాలు.1.శ.బ(వక్రిము)చూ,౧.ఈ
చ''గీ.ఈలతాలతలంపులబీలువాలు,,
భార.అశ్వ.౧.ఆ:
2.శ.బ(పరుషము)''ఎ.గీ.మరలెదుర్కొష.
ణుఁడుతోనతెరలెనేన,యపుడుసమ్మె
టకోలలనంటుళములఁ,జేలు కోలల్రవే
టులనీలతాల,యదలుపులవాహనంబు
లుచేదరిపలచె,,భార.ద్రో.3.ఆ:కంక
ర,కరసు,కలక,కలు కు,క్రొవ్విదము,
గండ్రలు,చిడిపి, దురుసు,పరుసఁ దన
ము,పరుసన,పరుసనము,పరుసు, పలుస
ము,పిలుము,ప్రల్లదము,మొలకు,మొల్ల
ఈలమి.1.శ (గుల్మము) చూ, ౨. ఈర
ము'' వ. పూఁ బొదరిండ్లయీలమిమ
లుంగున,,కళా.౧.ఆ:
2.శ(సాంద్రము)'' ఈలమిగాటుకచి
మ్మచీఁకటుల్,,చూ,ర.అన్నము.
ఈలము.శ—పై—
ఈల.1.పా(తస్కరసంకేతధ్వని)
2.శ(లజ్జ)''విడువుమీలయటంచునోడి
వెహేము,,స్వా.3ఆ:కసరు,కసురు,నా
న,పుచ్చటిక, పుచ్చడిక, పుచ్చడీక,పు
చ్చడీకతనము, పుయిలోట,బిడియము,
బిడ్డెము,బొసుకు,లగ్గు,సిగు,సిగ్గు, సిబ్బి
తి.
3.పాం.౨.౨౧(అపదేశము)ఓల, నెప
ము,నెవము,వళుకు,సాకము.
4.శ(ఒకదినుసుపుల్లగానుండుకూర)
5.శ(చిమ్మటకూఁత) [ని)
6.శ (గోపకులులోనగువారిసంకేతధ్వ
ఈలకలుచు.శ.అ.క్రి. చూ,ఇలకలుచు.
ఈలకూఁతలు.శ.బ (బాలక్రీడావిశేషము

చూ,అందలములు.

ఈలగ్రద్ద.1.శ.(లోభి)చూ,౨.అడియరి.
2.శ(శ్యేనభేదము)చూ,అదుజు.

ఈలపురుగు.శ.చూ,ఇలకోడి.

ఈలాగు.పా.చూ,ఇప్పాట.

ఈలుగు.శ.అ.క్రి(మరణించు)చూ,ఇలుగు.
"క.పవనసుతు చేతనాభూ,ధవుఁడీలిగె నేని,,భాగ.కర్ణ.౨.ఆ:

ఈలువు 1.శ (పాతివ్రత్యము)
2.పా(అభిమానము)

ఈల్గు.శ.అ.క్రి (మరణించు) చూ,ఇలుగు.

ఈల్గుట.భా.౩.౨౨౫.(మరణము) కడ, క్రుంకుట, గిట్టింపు, గీటడంగుట, చక్కఁడగుట, చావు, తుది, తెగుట, త్రుంగుట, త్రెళ్లుట, పెద్దనిదుర, పెద్దనిద్దుర, పెన్నిదుర, పొలి, పొలియుక, మడియుట, మిత్తి, వీడుకోలు, వీడ్కోలు, సమయుట, సావు

ఈవ.శ. చూ,ఈఁగ

ఈవంక. పా. చూ, ఇద్దెస

ఈవరి.శ.(దాత)చూ,ఈగికాఁడు

ఈవల.1. శ. చూ, ఇద్దరి.
2. శ. చూ, ఇటుపిమ్మట

ఈవి.శ.(దానము) చూ,౧ ఈగి.

ఈవికాఁడు.శ (దాత)చూ, ఈగికాఁడు

ఈవు. శ .స (నీవు)

ఈవులమొదవు.శ. (కామధేనువు)చూ,అడిగిననొసఁగెడియావు

ఈవులమాౢను. శ. చూ, ఈగిమాౢను

ఈవులరతనము.శ (చింతామణి)చాగరతనము, జేజెలమానికము, తలఁపుమిన్న, తలఁపురతనము, తలఁపుతాయి, పుడుకుగల్లు, వినువారలమానికము, వేలుపుమానికము

ఈఁవె.సాంర.౧౩,చూ,ఈఁగ.

ఈశ్వరప్రియములు.పా. బ (ధాన్యవిశేషము)చూ,అక్కుళ్లు.

ఈసడము.శ(నింద)చూ,అగడారు.

ఈసడించు.1.శ.అ.క్రి.చూ,అసహ్యపడు"గీ.అంతనొకనాడునిర్మలస్వాంతహాని, హాళిభుజియింపఁబాత్రలో వ్రేలుదునిసి,పడినమదినీసడింపక కడకుఁదిగిచి, వైచిభుజియించెనప్పతివ్రతలతల్లి,, పాంచా.3.ఆ:
2— (కోపించు) చూ, అప్పళించు "హెచ్చునట్టిపే, రీసుననీసడించుచు" కళా.3.ఆ:
3.శ.స.క్రి(నిందించు)చూ,అడిపోసికొను"సీ. చండాలుఁడని సారెసారెకున న్నీవీసడించుట పాటియేతలంప,,హరిశ్చ.౪.ఆ:

ఈసడింపు.1.పా(నింద)చూ,అగడారు.
2.పా(తిరస్కారము)చూ,అలచు.
3.పా(చులకదనము)

ఈసపిట్ట. శ (మత్స్యవిశేషము) చూ,అంబుపక్కెర

ఈసరుఁడు.1.పా.వై= (ఈశ్వరః, శివుఁడు)చూ,అంగమొలవేల్పు
2. పా (దేవుఁడు)

ఈసలు.భా. ౨. ౯౫. బ (వల్మీకమక్షిక)

ఈసు.1.శ.వై =(ఈర్ష్య)చూ,౧ ఈరస
2.శ.వై(కోపము)చూ,౨ అంకపాంకములు
3.శ.వై (ద్వేషము)చూ, 3 అంకపాంకములు

ఈసుకాఁడు. శ.వై (ఈర్ష్యాళువు) ఉడుకుఁబోతు, ఏవకాఁడు

ఈహీ.శ.అవ్య. చూ, ఇసిరో. "తక్కినబలాధీశాఖ్య కీటంబులిం, దెవ్వం డెవ్వఁడో మేలెచేటెఱుఁగరీహీ,, కవిక.౨.ఆ

# ఊ

ఊ. ఒకయక్షరము. [గవించు.

ఊంకించు .శ.అ.క్రి (యత్నించు)చూ,అం

ఊంకింపు .1.పా(యత్నము)చూ, అయత
ము.

2.పా (విజృంభణము) ఊప్పెన,ఎసక
ము,ఏర్పాటు,ఏపు,ఏస,కయిపు, కేరుపు,
కైపు,కొప్పరము, గుంపెన,గోటాపన,
చిందఱ,చీఁదఱ,డాక, వళావళి, వీక.

3.పా(కుప్పింపు)

ఊంకు.1.శ(సమ్మతి) చూ,ఇచ్చగింత " క.
ఎక్కుడుకులంబున నతవికి, నిక్కపుటా
లైనదాని నీచకులుండుం,క్కొక బలిమిం
గవిసినఁ, దక్కొని చంపుటయరాజధ
ర్మంబెంచన్,,విజా.ప్రా.కాం

2.శ.అ.క్రి(ఎగురు,ఉత్పతనమగు)"ఊం
కుచెందువిధంబున,,ఉ. హరి.ర.అ:ఉ
ఱుకు,ఎగయు,ఎగసిపడు,ఎగసిల్లు,ఎగు
రు,ఎపాయు ,గోరించు,జరగు,జరుగు,జా
ఱు,త్రుళ్లగించు,తుళ్లియాడు, త్రుళ్లు,
దాఁటు,దుముకు,దూఁటుకొను, నెగి
యు,నెవయు,పల్లటీఁగొను, పల్లటీల్దాఁ
టు,పల్లటీల్వేచు,మిట్టించు, మిట్టిపడు,
మిట్టు,మిడియు,మిడిసిపడు,మిడుకు,మి
డుకుమాలు,లాఁగించు.

ఊంకుటుంగరము.శ(వధూవరులుపెండ్లిచేసి
కొనుటకుపరస్పరముసమ్మతించిమార్చు
కొనెడియుంగరము)

ఊంకుడు. పా ( కన్యాశుల్కము )
ఊంకువ,ఊంకువు,ఓలి,పయిఁడి,పైఁడి,
ప్రండి,సంకు,సంకుడు,సుంకము.

ఊంకువ.పా—పై—

ఊంకువు.పా—పై—

ఊంగ .శ (బిడ్డలకుఁబోసెడుచనుఁ బాలా
ముదము) "క. అంగములు మిగులనలి
యఁగ,నుంగెయుంగేయటంచు నొకని
మిషమునో, రంగాయ వేయుకే ద్పుచు,
నంగీకృతబాల్యచేష్టనతఁడట్లుండన్,,ప
ర.౧.అ:ఉగ్గు,కంగు.

ఊంగరపువ్రేలు.శ(అనామిక) దబ్బవ్రేలు.

ఊంగరము.శ.వై.చూ,అంగుళీయకము.

ఊంగడి.పా (పశువ్యాధిభేదము) చూ,అ
దురుద్రిక్క.

ఊంగిడి.శ—పై— [టము.

ఊంగుటము.శ.వై=(అంగుష్ఠ) చూ,అంగు

ఊంగ్రము.శ.వై.చూ,అంగుళీయకము.

ఊంచు.1.శ.క్రి.(ఊంచఁజేయు) ఊనుచు.

2.భా.౩.౧౩౦స.క్రి(కీలించు)తగులఁగ
ట్టు,తగులఁబెట్టు,పెట్టు, వేయు.

ఊంచుకొను.శ క్రి( పెట్టుకొను)

ఊంట.1.శ.(గోళకము) ఊంఛ,గుండు.

2.శ(ఊండుట)

3.శ(పర్వులము) ఊండ,ఊంప్రము,గుం
ప్రము,గుడుసు, బటువు, బవిరి,బ్రవి,వ
ట్రు,వట్రువ.

ఊంటగాలము.శ (సీసపుగుండుకట్టినయొక
దినుసుగాలము) తద్భేదము —గోరుగాల
ము.

ఊంఛ.1.(గోళకము) చూ,౧.ఊంట.

2.శ(పర్వులము) చూ,౩.ఊంట.

ఊంఛక్రోవి.శ (యోగివేత్రము) లాతము,
లాతాము.

ఊంఛసురియ.శ (ఆయుధవిశేషము)తద్విశే
షములు:— కట్లగుదియ, కరిచిలుకు,
కొరడు,కోల,గుమితి, గుమ్మితి, చింగో
టి,చికటారి, చిక్కటారి,చిప్పకత్తి ,జ
ముదాడి, డొంకెన, తగుకత్తి,దసెన,
దొంకెన, దోసముదారి, మొహరా,
సత్తి,సామంతరాగోల, సిరాణము.

ఊండి.1.శ.అప(ఒకప్రత్యయము)

2.శ.అవ్య.(మొదలుకొని అనునర్థము తెలుపునది.)

ఉండు.1.శ.అ.క్రి.(వసించు) చూ, ఇమ్ముకొను.

2.—.(వర్తించు) కొల్రిలు, ప్రబ్బు, మను, మాడు, మెలఁగు, మెలయు.

3— (శేషించు) నిలుచు, నిల్చు, మిగులు.

ఉండువాఁడు. పా.(వర్తిష్ణుఁడు.)

ఉండె. పా.(ఊరుమూలప్రదేశము.)

ఉండ్ర.శ.(కదరము*) ఉండ్రన, ఉండ్రెన, వెలిచంద్ర.

ఉండ్రిము. శ .చూ, 3 .ఉంట.

ఉండ్రములు.శ.బ. (మోదకములు.) ఉండ్రాలు, కుడుములు.

ఉండ్రస.శ.చూ, ఉండ్ర.

ఉండ్రాలు.శ.బ.చూ, ఉండ్రములు.

ఉండ్రెన.శ.చూ, ఉండ్ర. [నుట.)

ఉంపుడు.1.శ. (గుత్తగా వేశ్యనుంచుకొ

2.చం.(ఉంచుకొనఁబడిన వేశ్య.)

ఉంబ.శ.వై=(అంమ్భా, గోవులయంభారము.) చూ, అంబే.

ఉంబళి.శ. (పన్ను లేనిది.) "ఉంబళిగ్రామము."

ఉక్కు.1.పా(ధీరుఁడు) ఉక్కుతునియ, ఉరియు, ఉటియ, గడుసరి, గద్దరికాఁడు, గాళికుఁడు, గుండా, తుటారికాఁడు, దంట, దట్టుఁడు, దిటవరి, దిట్ట, దిట్టఁడు, దిట్టరి. 2.శ(ఉత్సాహము) చూ, 3.అవి.

ఉక్కడఁగు 1.శ.అ.క్రి. (ఉక్కుచెడు.) "గీ. మహీజంబులెక్కరందుఁగొందఱుక్కడంగి." భార. అర.౨.ఆ:ఉక్కఱు, ఉక్కుమడఁగు.

2—.(మరణించు) చూ, ఇలుగు.

ఉక్కడము.1.శ.వై. విశే=(ఉత్కటః, పృథువు, పెద్ద) "ఉ.ఉక్కడమైనమంచి హానువొప్పెడు నాహయరత్న మెక్కినక్." సా.౧.ఆ: ఒడ్డు, కంచి, కోర, కోలు, గంగ, గజ, గనప, గఱువ, గొప్ప, జగము, తారు, దండి, దొడ్డ, దొడ్డు, నాగ, పఱి, పెడ, పెద్ద, పేరు, పోట, బడ, బలు, బలువు, బుఱ్ఱ, బొంత, బోరు, మలచము, రపణము, వఱఁద, సుర, హురుమత్తు, హుర్మత్తు.

2. పా. (దుస్సాహసము.) ఉక్కణము, దెప్పటికము, వెక్కసము.

ఉక్కడీఁడు.శ.వై. (శూరుఁడు) ఉక్కరి, ఉక్కుతునియ, ఎక్కటి, గండఁడు, గడుసరి, చాలుమానిసి, చుఱుకరి, చుఱుకటీఁడు, చుఱుకరి, జెట్టి, తెంపరి, దునీఁడు, దునీదారు, దునెదారి, దునేదారి, దుముదారి, నెఱసరి, పోటరి, పోటుకాఁడు, పోటుబంటు, పోటుమగఁడు, పోటుమానిసి, బంటు, బిరుదు, మగఁడు, మగవాఁడు, మనసరి, మాసటి, మాసటీఁడు, మాస్టీఁడు, మిడిమాసి, మొక్కలి, మొక్కలీఁడు, మొక్కలుఁడు, మొనకాఁడు, మొనసరి, వజీరుఁడు, వజ్జీరుఁడు, వజ్రీఁడు, వటారి, వడికాఁడు, వడిగలవాఁడు, వడివాఁడు, వాఁడిగలాఁడు, వాఁడిమగఁడు, వాలుమగఁడు, సరదారు, సరిమిడిమానిసి, హంవీరుఁడు.

ఉక్కణము.1.శ. (రక్షణము) చూ, అద్దికము. "చ.కడిందిమగల్ దగునుక్కణంబుగా, భయమను పేరు లేక నిరపాయముగావిడిపించుచుం దునః, ప్రియమగు భంగిసేన నడిపించె.,, నిర్వ.౫.ఆ:

ఉక్కఁబట్టు.శ.స.క్రి.(విడుచు) ఉడుగు, ఉడువు, ఉరువు, ఎడఁబాయు, ఎడయు, ఎడలు, ఎవగించు, డిగఁద్రావు, డిగ్గఁద్రావు, డిగ్గనాడు, తక్కు, తరలు, తొలఁగు, తొలవు, దిగఁద్రావు, దిగనాడు, దిగవిడుచు, దిగ్గనాడు, పాయు, పోయు:, మా

ను,కోయు,వదలు, విడఁదొబ్బు,విడ
నాడు,విడుచు.

ఉక్కరి.శ. (శౌర్యవంతుఁడు,శూరుఁడు)
చూ,ఉక్కడీఁడు.

ఉక్కలు .శ.అ.క్రి. చూ,౧ఉక్కడఁగు.

ఉక్కలుఁడు.శ.వై=(ఉత్కలః. ధురంధ
రుఁడు)

ఉక్కళము .1.శ.వై=(ఉపనిష్కరమ్.పు
రాభిముఖరాజమార్గము)
2.శ(శత్రువులెత్తి వచ్చుటను దెలిసికొను
టకైయుంచుకావలి)కోవరము, కోవుర
ము. [మేలము,వెక్కసి.

ఉక్కళుఁడు.పా.వై(దుస్సహుఁడు)మిడి

ఉక్కిరిబిక్కిరి.శ(ఊపిరితిరుగనిది)

ఉక్కిఱి.పా(అనుచ్ఛ్వసనము)

ఉక్కినము.శ(కపటము)"సీ. గాండీవమా
దిగాఁగలయాయుధంబులనుక్కినంబున
నప్పుడొడిచికొనఁగ, మఱచినవాఁడ
య్యె"భా.ర.అర.౧.ఆ: కన్ను, కవు
డు,కిటుకు,కీలు,కువాడము, కువాళము,
కువ్యాపము, కైపు, కొడు, గజను,గ
బ్బ,గబ్బి, గవురు, గుబుసు, గొరు,చిట్టె
కము,జిత్తు,టసలిక, టాటోటు, తవలి,
డంబము,డంబు,డబ్బ,తచ్చన, దుత్తూర
ము,నయగారము, నెపము, పిక్కు, పొ
చ్చెము,పొర,బూమియ,బూమె,మతక
ము,వాయిసిక, వెద్దు,వైసిక,సట.

ఉక్కివుఁడు.శ (కపటముగలవాఁడు, కుజ
నుఁడు)చూ,అడిగొంటు.

ఉక్కిస.శ(కాసము,పొడిదగ్గు)ఉబ్బసము,
గస,డగ్గు,దగ్గు.

ఉక్కీఁడు.శ(మూఢుఁడు, తెలిసియు తెలి
యనివాఁడు) "ఉక్కీలయి నేర్పులేకత
మకించిపయింబడినొచ్చు వారు"నిర్వ.
౩.ఆ:ఎడ్డె,ఎడ్డెఁడు,ఓగు,కఱటి,దుడ్డు,
పాలసుఁడు,పెంక, పెచ్చారి, పెడక
ట్టె,పెడసరకట్టె,పెయ్య,పెళుచు,మం
కు,మొండి, మొండికట్టె, మొండు, మొ
ప్పియ,మొప్పె,మొఱకు, మొఱకుఁడు,
మొఱటు,మొఱ్ఱ,మోటు,మోఱకు,మో
ఱకుఁడు,మ్రోడు.

ఉక్కు.1.శ (శౌర్యము) చూ,శ.అగ్గలిక.
2.శ(అయస్సారము)
3.శ(స్థైర్యము)ఉజిది,ఒఱపు, కడంక.
4.పా(దృఢము)చూ,౧.ఇట్టలము.
5.శ.అ.క్రి(మరణించు)చూ,ఇలుగు.
6—(నలఁగు)చూ,౨.ఇఱియు.

ఉక్కుతీఁగ.శ(ఉక్కుతం?) [డీఁడు

ఉక్కుతునియ.1శ(శూరుఁడు)చూ,ఉక్క
2.శ(ఉక్కుతునుక)
3.పా(ధీరుఁడు) చూ,౧.ఉక్క. [గు.

ఉక్కుమడఁగు.శ.అ.క్రి. చూ, ఉక్కడఁ

ఉక్కెఱ.శ.వై= (ఉపకారికా.చక్కెరఁ
జేర్చిపొరఁటినపిండి)

ఉగము.1.శ(ఆయువు) ఉసులు , మనన.
2.పా.వై(యుగము)

ఉగాది.శ(చాంద్రాయణసంవత్సరాది)

ఉగ్గడ.పా(మర్యాద)ఉగ్గడు,కట్టడ,కర,
గడి,గడువు,గరుసు,పడికట్టు,బవిసి,బై
సి,మరియాద, మేర.

ఉగ్గడించు.1.శ.వై.అ.క్రి(శబ్దించు,ధ్వనిం
చు)"బంగరుటందియలుగ్గడింపగ౯"
పాండు.౨. ఆ: ఉలియు, కిలకొట్టు,
క్రందిల్లు,క్రందు,క్రోలుచు, క్రోల్చు,గ
ఱగఱలాడు,గిలకరించు,గీపెట్టు, గోడ
గించు,చెలఁగు,జడియు ,?వుసు,బరలు,
బోరుకలఁగు,బోరుకొను, మొగకట్టు,
మొరయు,మ్రోఁగు,మ్రోయు,మ్రోవు,
రఱించు,రవాళించు, రొదాళించు,లొ
టలొటమను,వాఁగు.
2.శ.స.క్రి(పఠించు)చూ,౧.అను"హరి
నామాంకములుగ్గడించుచు ,, లక్ష్మీ.౫

ఆ:

ఉగ్గడించుట. పా.(నాట్యానుగుణ శబ్దగుంభన) ఉగ్గడింపు,ఉగ్గలింపు.

ఉగ్గడింపు.1ష.3.28(వినుతి)చూ,అగ్గింపు.
2.పా.చూ,ఉగ్గడించుట.

ఉగ్గడువు.1.శ.వై=(ఉత్కటః, అధికము) చూ,ర.అంకపాంకములు"చ.ఏటుగం టియు,గ్గడువగు నెత్తుటన్నుడిసి క్రక్కుడు నెత్తుటఁగుంకుమచ్ఛవిం, బఱసి"ఉ. హారి,ర.ఆ:
2.పా(వేళాతీతము)
3.పా(తీవ్రము,శీఘ్రము) చూ,గ.అంకపాంకములు. [వు]

ఉగ్గము.శ.వై= (ఉద్గాధి)హా.భాండగళరజ్జు

ఉగ్గలింపు. భా.౧.౧౩౦.చూ,ఉగ్గడించుట

ఉగ్గలించు.శ.అ.క్రి (నట్టువుడుకొలిపించు)

ఉగ్గించు.శ.స.క్రి (పడుగుపేకలపోగులమ చేర్చు)

ఉగ్గు.శ.చూ,ఊంగ.

ఉగ్గుడు.శ(మర్యాద)చూ,ఉగ్గడ.

ఉగ్గులు.శ (వసలు) "సీ. మేనినిగ్గులు, మాన్పి మెదలకచిత్రరూపముభంగిఁ బ ర్వతభాతినుం డె,,వా.ర.ఆ:తరులు, త ఱులు, నెత్తఱులు,వొక్కులు,ముదు తలు,గ్రుక్కులు.

ఉగ్గుపడు.శ.అ.క్రి(ముడుతపడు)

ఉగ్గులువాఱు .శ.అ.క్రి(పెనఁగొను) చూ, అల్లిబిల్లిగొను.

ఉగ్మలి.శ.(స్త్రీ)చూ,అలివ.

ఉగ్రాణము.1.పా (భాండాగారము, ధనముంచెడుచోటు)ఖజానా,పంటసాల, బండరము,బండరువు, బండారము, బండారు,బొక్కసము,ములుగు.
2.శ(కోష్ఠము, సామగ్రులుంచెడుగది) కొటడి,కొట్టము, కొట్టు, కొఠారు,గిడ్డంగి.

ఉచింత.శ(ఖండి*) ఉచ్చింత,ఉచ్చెంత.

ఉచుకరించు.శ.అ.క్రి (ఆనాదనము చేయుచుక్కుమను)

ఉచుక్కు.శ (ఉచుకరించుటయందగుధ్వన్యనుకరణము)చూ,అసురుసురు.

ఉచ్చ.శ(మూత్రము)కొలుమడి, కొల్మడి, నీరు.

ఉచ్చబుడ్డ.శ (మూత్రకోశము)నీరుతిత్తి.

ఉచ్చమల్లి. శ (దిసమొలఆఁడుది, నగ్నిక) "వ.అయ్యవసరంబునఁగోటలియనంగ, నొక్కయుచ్చమల్లి వచ్చియడ్డపడిననా నగ్నికంజూచి,,ఉ.హారి.౬ ఆ:

ఉచ్చి.శ(బ్రహ్మరంధ్రము)బొదల,సోడు, నడినెత్తి,నడుగుంట, మచ్చన, నచ్చెన, మాడపట్టు,సోడు.

ఉచ్చింత.శ.చూ,ఉచింత.

ఉచ్చిచ్చిరే.శ.(కుక్కనుపిలుచుటయందగు ధ్వన్యనుకరణము) చూ, అసురుసురు.

ఉచ్చు.1. శ. (పక్షిలోనగువానికిఁ బెట్టెడి యుక్తి,వాగుర) ఉరి,గుచ్చిక,జువ్వ.
2.శ.అ.క్రి.(నాటివెడలు.) "ఎ.గీ.ఉర మునడిఁదాఁకివీఁపునవుచ్చిపోయె." భార.భీష్మ.౩.ఆ:

ఉచ్చెంత.1.పా. చూ,ఉచింత

ఉజ్జ.1శ.(ఊహ)

ఉజ్జగము. పా.వై. (విసర్జనము) చూ, అఱుట.

ఉజ్జగించు.భా.౩.౧౩౯.స.క్రి. (త్యజించు) ఉజ్జనచేయు,ఏచు,విడుచు.

ఉజ్జగింపు.భా.౨.౧౭౭.(విసర్జనము) చూ, అఱుట.

ఉజ్జగిల్లు.శ.వై.అ. క్రి.(అపసరిల్లు, తొలఁగు) "ముక్ ద్వాపరముజ్జగిల్లుతఱి,, పాండు.౩.ఆ:ఉడివోవు,ఊడనిఁ బా డు,ఎడగిల్లు,ఎడయు,ఒదుఁగఁ బాఱు, ఒదుగు,ఒదుగువడు,ఓరగిల్లు, ఓరసిల్లు,

ఓసరిలు,ఓసరిల్లు,ఓసరు, కేడించు, క్రేడించు,గెంటు,చెంగు, జడియు,జీఱువాఱు ,తలఁగు,తల్గు, తలవు, తీయు, తూలఁబాఱు,తూలు, తెరలఁ బాఱు, తెరలు,తొలఁగఁబాఱు, తొలఁగు, నక్కు,పాయగిలు,పాయగిల్లు, పాయవడు,పాయవాఱు,పాయు,పేడెత్తు,ప్రిదులు, బెదఁకు, బెణఁకు,మిడివోవు, వసులు,విరియు.

ఉజ్జగొను.శ.స.క్రి(ఊహించు) "సీ-అపకీర్తి గొడఁబడునొగాము లెఱుఁగఁ దుల జ్జాభిమానంబులుజ్జగొనఁడు,, రుక్మాం. ౫.ఆ: ఉజ్జాయించు.

ఉజ్జన.సం .వై= (ఉజ్ఝనమ్. విసర్జనము) చూ,అఱుట.

ఉజ్జనము.శ.వై = —వై—

ఉజ్జనసేయు.శ.వై.అ.క్రి.(త్యజించు)చూ, ఉజ్జగించు."సంధ్యాభివందనక్రియలుజ్జనసేయు.,, కాశీ.౪.ఆ:

ఉజ్జాయించు.శ.స.క్రి.చూ,ఉజ్జగొను.

ఉజ్జి.శ. (సమానము) చూ,జతనుగలము.

ఉజ్జ్వకల్లు.శ.(అగ్నిపర్వతమునుండి వెడలఁ గ్రక్కఁబడినరాయి.)

ఉటంకము.శ.(సంగ్రహము)టూకి.

ఉటంకి.1.శ (చొరవగలవాఁడు)ఉటంకు.
2.శ.(ధైర్యశీలుఁడు)ఉటంకు. [కించు.

ఉటంకించు.శ.స.క్రి.(సంగ్రహించు) టూ

ఉటంకు.శ. చూ,ఉటంకి.

ఉట్టి.శ.(శిక్యము)చిక్కము. [ల.

ఉట్టిచీల.శ.(ఇరుప్రక్కల తలయేర్పడినచీ

ఉట్టిపడు.1.శ.అ.క్రి(అతిశయించు)చూ,౨ అదరు."ఆయతబంధురలంఘనోద్ధతిక్రిక్కిగూర్చినవేగముట్టిపడ." శేప..౨.ఆ:
2—.(ఉన్నట్టుండికలుగు)

ఉట్టు.1.శ (లవణజన్యస్థానము)ఉప్పళము, ఉప్పిలము, ఉప్పువాము, ఉప్పుఁబల్లి.
2.శ.అ.క్రి. (కాఱు,స్రవించు)ఉరలు, ఊడు,ఒలుకు,ఓడిగిల్లు, కరఁగు,కరఁగువడు,కయిప్రాలు, కైప్రాలు,కాఱు, గీలు,చినుకు, జల్లించు,జాఱు,జొబ్బిలు, జొబ్బిల్లు,తొంగలించు, తొట్టు,తొరఁగు,తొరుఁగు,దిగువాఱు,వడియు,వారు

ఉట్రవడియము.శ.(ఒకదినుసు వడియము)

ఉట్లబొద్ది.శ.(ఒకానొక చెట్టు)

ఉఠాణి.శ.(ఉన్నతము)ఎగుడు,ఎగువ,ఎత్తరము,ఎత్తరవు,ఎత్తు,కొప్పు, క్రొక్కలు, తనరుపు,తనర్పు,పొడగు,పొడవు,పొడుగు,పొడువు,మిట్ట,మిడి,మిఱ్ఱి.

ఉడి.స.శే.ఉర(వ్యాఘ్రము)చూ,౫.ఆటమట

ఉడికిల్లు.శ.అ.క్రి.(తపించు) చూ,ఆరటపడు.

ఉడిగము.శ.(పరిచర్య)ఊడిగము,ఊడియము,ఊడెము,కొల్వము,చాకిరి.

ఉడివోనిపల్కులు.సం. (వేదములు) చదువులు,తొలిచదువులు, తొలుచదువులు, తొలుఁబలుకులు, తొలుమినుకులు,తొల్చదువులు,పెనుమినుకులు, ప్రాఁగబ్బములు,ప్రాఁజదువులు, ప్రాఁతపలుకులు, ప్రాఁబలుకులు, ప్రాఁబల్కులు, ప్రామినుకులు,ప్రామిన్కులు,మినుకులు,మొదటిమినుకులు.

ఉడివోవు.1.శ.అ.క్రి.(అపసరిల్లు)చూ,ఉజ్జగిల్లు."క .అడిసిగ్గులుతమకంబులు,నుడివోవఁగఁగేలికడఁకలొదవఁగ.,,మార్క.౫.ఆ. [డు
2.శే.అ.క్రి.(వ్యర్థమగు)చూ,గఱిబడిప

ఉడుక.శ.వై= (హుడుక్కా)ఉడుక్క, డుక్క, డుపుడక్క, డుబుడక్క, బుడిబుడుక్క, బుడుబుడుక్క,హుడుక,హుడుకు

ఉడుకోటము.శ (ఉడుకోడుట) [పడు

ఉడుకోడు.శ.అ.క్రి(తపించు) చూ,ఆరట

ఉడుకు.1.శ(సంతాపము)చూ,౨ అక్కస
ము. 2.పా(సూపకారము)బానసము,
వంట,సువారము
3.శ.అ.క్రి (తపించు)చూ, ఆరటపడు
ఉడుకుఁబోతు. శ .చూ , ఈసుకాఁడు
ఉడుకువ.శ (విరతి) ఉడ్కువ,ఊరట,ఊ
ఱట,నిలుకడ,విఱుగడ [డుక.
ఉడుక్క.శ.వై= (హుడుక్క) చూ,ఉ
ఉడుగర.1.పా (విరళవస్త్రము)
2.శ (ఉపాయనము) చూ, అప్పనము
"గీ.కడఁకరా సింగమునకుడుగరలొసం
గె ,, అచ్చ.యు.కాం:
3.శ (బహుమానము)"వ. రాముండత
నిఁగౌఁగిటం జేర్చి గారవించి యుడుగరలి
చ్చియునిచిన " యు.3 ఆ:
ఉడుగు.1.శ.అ.క్రి (క్షీణించు)ఊఁచపడు,
ఊఁచపోవు,ఊసరిల్లు,ఒగుడుకఱదు,క్రి
య్యు, క్రుయ్యఁబాఱు, క్రుయ్యు, చి
క్కు,చయ్యు, తీయు,తాఁకువడు,నకన
కఁబడు, నకనకలాడు, నకనకలుగుడు
చు,నకనకల్లుడుచు, నవయు, పీఁకవా
ఱు,పెక్కటిల్లు,వక్కు,వట్టు,వడియు,
సొటసొటవోవు,
2.శ. స.క్రి (విడుచు,మాను)చూ,ఉ
క్కఁబట్టు.
ఉడుత.శ.(చిక్రోడము)ఉఱుత.
ఉడుతచార.భా.౨.౧౫౪ (చిత్రవర్ణవిశేష
ము)తద్విశేషములు:—ఏనుఁగడుగు,కర
కంచు,గోటి,తల్లు,పట్టెమార్పు,పప్పళి,
బసంతి,బొమ్మంచు, మాదవళము,మాద
ళము,మాదావళము, మాదావళి,హేర
వళి.
ఉడుతచారంచు.పా(వస్త్రాంచలవిశేషము)
ఉడుపకుక్క.శ (ఉడుములోనగువాని వేఁ
టాడెడుక్షుద్రశునకము) తద్విశేషము
లు:—కంచుడమారము, కార్చిచ్చు,గడి
వోతు, గంధ్రిగొడ్డలి,దొంగలమిండగీఁ
డు,బుసుకఁడు, మొఱసపము,రణబేసు.
ఉడుపపిల్ల.పా.(గాఢేరము) [చు)
ఉడుపు. శ. పై. (ఉడుగఁజేయు,ఉడిగిం
ఉడుఁబోతు.శ.(విరతశీలుఁడు)
ఉడుఁబోతుపిందె.శ(కాపుడిగినపిమ్మట
చెట్లయందు కలిగెడుపిందె)
ఉడుము.శ.(గోధిక) ఉఱుము,ఏపరి,తేలు
మేపరి.
ఉడువు.శ.స.క్రి.(విడుచు, మాను)చూ,ఉ
క్కఁబట్టు."ఉ.నింతయుకాముశక్తి ను
డివింపఁగశక్యమెయొక్కనారికిన్."భా
ర.ఆది.2ఆ:
ఉడుసర.శ (కాకమాచి) కాఁచి,కామం
చి, నల్లబుడుసర
ఉడ్కువ.శ (విరతి)చూ,ఉడుకువ
ఉడ్డ.1.శ.(రాశి)ఉడ్డా,కుప్ప, కుఱు కు,కు
వ,కువ్వ,కూటువ,కూటువు,కొణిఁగె,గు
ట్ట,తిట,తిప్ప,తెట్ట, తెప్ప, తేప,దిబ్బ,దె
మ్మ,దోర,పడె,పుంజి, పుట్ట,పోగు,ప్రో
క,ప్రోగు,ప్రోవు, రాసి,లప్ప,లిబ్బి,లొ
ద్ద,వామి.
2.శ.స.(చతుస్సంఖ్య)చూ,౧ అడ్డ
ఉడ్డకేలుగలాఁడు. సాం. ౧.౪ (విష్ణువు)
చూ, అడుగుచెమ్మటలాఁడు.
ఉడ్డకేలువేల్పు. శ. —పై—
ఉడ్డమోము వేలుపు.శ. (బ్రహ్మ)చూ,అం
చరవుతు.
ఉడ్డా.1.శ.(రాశి)చూ,౧ఉడ్డ
2.శ.స.(చతుస్సంఖ్య)చూ,౧అడ్డ
ఉడ్డాడు.శ.అ.క్రి(క్షోభించు)చూ,అక్క
లిపడు"ద్వి.వేగనంతనిషల్లైవెఱచియు
డ్డాడ, నలయకపర్షంపుఁడనిపల్కియ
నుప.,భాగ.౧౦స్కం
ఉడ్డుగుడుచు.శ.అ.క్రి. (ఊపిరితిప్పలేక
బాధపడు,సంభ్రిపడు)చూ,౧౦.అడరు

ఉణ్ణపల్లంచి.శ.(బాలికా క్రీడావిశేషము) చూ,అంజీ. [క్కూర

ఉణుజు.శ.(మత్స్యవిశేషము)చూ,అంబుప

ఉతక .శ.(ఉత్తరానితిరిగెడుకొయ్య)ఉద క,రోలుమాను,ఱోలుమాను.

ఉతుకు.శ.స.క్రి.(ఉదుకు)ఉదుకు,ఉసుము, గుంజు,పులుము.

ఉత్త.శ (శూన్యము)చూ,అకటు.

ఉత్తొండములు.శ బ (ఆఁడువారికంఠభూ షావిశేషము)చూ, అడ్డిగలు.

ఉత ండాలు శ.బ.—పై.—

ఉత్తరడొక్కరము.శ.వై.=(ఉత్తరదోకక ర,మల్లగంధవిశేషము)చూ,అంజమెపె పట్టు. [ము

ఉత్తరాసి శ.(తలుపుక్రింద తిరిగెడుకుబుస

ఉత్తరించు.శ.స క్రి (ఖండించు) చూ,గఅ ఱఁఅసేయు.“ద్వి.తలలుత్తరింతు.,,రా అర.కాం.

ఉత్తరిగ.భా ౧.౧౮౮ (సరవిశేషము) తద్వి శేషములు — కటదంపె, గుబ్బసరము, చీరము,తాళి,తాళీ, పదకము, బన్న సర ము,బన్న సరి ముత్తెడము, ముత్తెసరము, ముత్తెసరి,పెఱుఁగునల్లలు.

ఉత్తరిగము.పా. వె. (అంసోత్తరీయము)ఒ ల్లియ,ఒల్లె,ఓణీ,కండువ,కండువా,పం చ,పైఁబట్ట, బయిటివాసము, బైటవాస ము.

ఉత్తరువు.శ.వై (ఆజ్ఞ)చూ, అప్పణ.

ఉత్తరేణు.1.శ.(అపామార్గము*) 2.పా. (ఖదిరము*)ఉలిమాను,కదర ము,చంచ్రి.

ఉత్తలపడు .1. శ.అ.క్రి. (సంక్షోభించు) చూ,అక్కలిపడు.

2— (సంభ్రమించు) చూ,అగడుప డు.“వీచీభుజావళియాలింగనకేళికుత్తల పడెన్.,,హరి.పూ.౬.ఆ:

3.—(వ్యత్యస్తమగు)“గ్రహతారకం బులు,తలపడఁజొచ్చె ,, భో. ౪.ఆ:త డఁబడు,తారుమారగు, తాఱుమాఱుప డు.

4—.(పరితాపపడు,తపించు) చూ,అ టటపడు. “అనవిసుచుంగలంగుహృద య౦బునఁ దాపమునివ్వటిల్ల.,, (అమీ ద)“అనుచుమత్తలపడిన య్యావసరంబు న.,,భార.విరా.౫.ఆ:

ఉత్తలపాటు.1.పా (భయము)చూ,అంజి క.

2.పా.(సంభ్రమము) చూ,ఉఱక్కులు.

3.పా.(దుఃఖము) చూ,గఅంగి ౨.

4 పా.(అభాగ్యము)

5 శ (త్వరపడుట)

6.శ (పరితాపపడుట)

7.శ.(వ్యత్యస్తమగుట)

8.శ.(కలఁతపడుట)

ఉత్తలపెట్టు 1.శ.స క్రి (త్వరపఱచు)

2—(పరితాపపడఁజేయు)

3—(వ్యత్యస్తముకావించు)

4.—.(కలఁతపఱచు)

ఉత్తలము.1.పా. (భయము) చూ,అంజిక.

2.శ. (సంభ్రమము) చూ,ఉఱక్కులు.

3.శ. (క్షోభము)చూ,కెలంకిలి

4.శ (పరితాపము) చూ,అఅక్కసము.

5.శ.(వ్యత్యాసము) చూ,అకటవికట ము. [మాఱు.

ఉత్తి.శ. (ప్రతినిధి,ఈడు) బదులు,పెట్టు,

ఉతుఁడు. శ.వై. =(యుక్త...) చూ,అరుహుఁడు.

ఉదక .పా.చూ,ఉతక.

ఉదరిపడు.శ.అ.క్రి.చూ,అదరిపడు.

ఉదరిపాటు.1.శ.(అదరిపాటు)

2.శ.(ఉలికిపడుట)ఉలికిపాటు.

ఉదయు.శ.అ.క్రి. (చరించు) చూ,గఅటవు

ది) చూ, ౧. అంశ.

3. శ (ఉండుట) "క. వేఱొక తెఱఁగు నవారులకు, మాత్రాడిక యునికి లెస్స,, భార. విరా. ౧. అ:

ఉనికిపట్టు. పా (గృహము) చూ, ౧౩ కృ.

ఉనుకువ శ (వాసము, ఉనికి) కొఁపు, కొఁపురము. [మ.

ఉనుచు. శ. క్రి (ఉంచఁజేయు) చూ, ౧. ఉం

ఉన్నరూపు. శ (యథార్థము)

ఉన్నవాఁడు. 1. శ (అన్యుఁడు) "మ. వీ, డతఁడే కాఁడగునున్న వారలకు సారూప్య సం, గతిసిద్ధింపదు,, భాగ. ౧౦. స్కం. ఎడకడవాఁడు, ఎడవాఁడు, ఎదురు, ఒం డొకఁడు, ఒకఁడు, ఒకరుఁడు, ఒకరువుఁడు, ఒకొరుఁడు, ఒకొరువుఁడు, ఒక్కఁడు, ఒక్కరుఁడు, ఒక్కరువుఁడు, ఒక్కొరుఁడు, ఒక్కొరువుఁడు, ఒడ్డు, కడవాఁడు, తేరకొఁడు, రిత్తకొఁడు, వింతవాఁడు.

2. శ (ఉన్నటివాఁడు)

ఉన్ని. శ (గొఱ్ఱెబొచ్చు) త్రుప్పడు, బొచ్చు

ఉన్నె. శ ని (ఉండునె) ఉన్నే.

ఉన్నే. శ. ని — పై —

ఉపతాయి. శ (మల్లవిజ్ఞానము)

ఉపమ. శ. వై = (ఉపాయః) చూ, ౩. అనువు "గీ. నృపవధూటినినవధింపనుపమయొకటి, యాత్మలోపలయోచించియచ్ఛతముగ" హరిశ్చ. ౫. అ:

ఉపమరి. శ (ఉపాయశాలి) చూ, అనువరి.

ఉపవడము. శ (అవబోధము) ఉప్పనడము, కనువిచ్చుట, మెలఁకువ, మెలుకువ, మేలుకొంచుట, మేలుకొంచుట, మేలుకొంట, మేలుకోలు, మేల్కాంట, మేల్కనుట, మేల్కొనుట.

ఉపారము. 1. పా. వై (ఉపాయనము) చూ, ౧. అప్పనము

2. పా. వై (నైవేద్యపదార్థము)

ఉపాసము. శ. వై = (ఉపవాసః) చూ, ౩౫

ఉప్పట్టు. పా. (బాలక్రీడావిశేషము) చూ, అందలములు

ఉప్పత. శ (అఘోషణము) గుపారు, గోరప, రంతు, రట్టడి, రట్టు, రిద్ది, రద్ద, రవ్వ, సుడి

ఉప్పతి. పా. వై = (ఉత్పత్తిః, జన్మము) పుట్టు, పుట్టుక, పుట్టుగు, పుట్టుబడి, పుట్టువు, బాము, మేను

ఉప్పతించు. శ. స. క్రి (ఓర్వలేనితనము చేత ఆడిపోపికొను)

ఉప్పతిల్లు. 1. శ. వై. అ. క్రి = (ఉత్పత్తిః, ఉత్పత్తియగు) చూ, ౯. అవెరు

2. భా. ౩. ౯౪. వై. అ. క్రి (అధిక్యమగు) ఉప్పొంగు, ఉబుకు, ఉబ్బితిల్లు, ఉబ్బు, జొబ్బిలు, జొబ్బిల్లు, పొంగారు, పొంగు, వెలివిరయు, వెల్లివిరియు

ఉప్పఁదనము. పా (లవణధర్మము) ఉప్పన

ఉప్పన. 1. పా — పై —

2. పా (లవణము) ఉప్పు, నీళ్లుపరుగు

3. పా (ఊషరభూమి) ఊసర, ఊసరము, కారు, చగడు, చగుడు, చవటి నేల, చవడు, చవుటి నేల, చవుడు, చౌట, చౌడు.

ఉప్పనఁబట్టెలు. శ. బ (బాలక్రీడావిశేషము) చూ, అందలములు.

ఉప్పర. శ (ఉప్పరజాతి) [చూ, అప్పుతాతి.

ఉప్పరము. 1. శ. వై = (అభ్రమ్. ఆకాశము)

2. శ. వై (ఊర్ధ్వభాగము) "దోమ తెరలుప్పర మెత్తిరి,, ఆము. ౫. అ: ఎగువల, ఎగువ, పయి, పై, పొడుగు, పొడువు, మీఁదు, మేలు.

ఉప్పరి. శ (ఖనకుఁడు) [ప్పుతాత.

ఉప్పరవీది. వెం. ౨౦ (ఆకాశము) చూ, అ

ఉప్పరించు. శ. స. క్రి (మల్లయుద్ధక్రియావిశేషము) "వ. మడమల మెడమలంచియును

(...గు) చూ,౨.ఉప్పతిల్లు.

ఉబ్బనీరు.శ.వై(ప్రసవజలము)ఉమ్మనీరు.

ఉబ్బరపోవు.శ.అ.క్రి(చేష్టలుదక్కు)"చ. ఉరవడిఁజెండు క్రమ్మతినయుబ్బరపోయి రిభామినీజనుల్,, వై.౩.ఆ: తెటకొపడు,నివ్వెఱపడు,మిడుగు, తెచ్చపడు, వెఱఁగుపడు. [బ్బు.

ఉబ్బరము.1.శ. వై (ఆనాహము) కడుపు

2.శ. వై= (ఉల్బణమ్. అతిశయము) చూ,౧.అగ్గలము. [౭.అదరు.

ఉబ్బరించు.1.శ.అ.క్రి(అతిశయించు) చూ,

2.శ.అ.క్రి(కడుపుబ్బు)ఉబ్బు.

ఉబ్బలి.1.శ(పంకము)చూ,అడుసు.

2.పా(ఖర్జూరము*)కజూరము, కజ్జురము,కజ్జూరము,గజ్జురము,పేరీఁదు.

ఉబ్బసము.శ.వై= (ఉచ్ఛ్వాసః. కాసము) చూ,ఉక్కిస. [ము.

ఉబ్బు.1.శ.వై(సంతోషము)చూ,౧.అరిసె

2.శ.వై.అ.క్రి(అధిక్యమగు)చూ,౨.ఉప్పతిల్లు.

3—(కడుపుబ్బు)చూ,౨.ఉబ్బరించు

4—(బొబ్బలెక్కునది చేయు) పొటమరిలు,పొటమరిల్లు,పొటమరించు, లేచు.

5—(సంతోషించు)చూ,౬.అలరు.

6—(స్థూలించు) [కపొట్టు,పొట్టు.

ఉమక.పా(తుషము)ఉముక,ఊఁక, నూఁ

ఉమాదము.శ.వై=(ఉన్మాదః) ఉమ్మాదము,కయివు,కైవు,తిక్క,త్రిక్క,పిచ్చ, పిచ్చి,పిచ్చితనము,రింబ,రిబ్బ,రిమ్మ,వెంగళితనము,వెకలితనము ,వెడఁగుతనము, వెట్టి,వేఁదుఱు ,వేలాకోలము,సీసము.

ఉమి.శ.వై= (ఊర్మిః.ఉమిసెడిఎంగిలి) ఉమ్మి. [యు,తూపొడుచు.

ఉమియు.శ.వై.స.క్రి (ఉమ్మివేయు) క్రా

ఉముక. శ. చూ, ఉమక.

ఉమ్మ.1.శ.వై= (ఉష్మః.) చూ,౩.ఆవి.

2.పా.వై(శోకము)చూ,౩.అడలు.

ఉమ్మగిల్లు.శ.వై.అ.క్రి(ఆవిరిచేనుడుకు)

ఉమ్మడి.1.శ(పొత్తు)" ఉమ్మడిసొమ్ముగాన"భో.౬.ఆ:పొత్తు.

2.శ(నిత్యపుఁగట్టడ)"సీ.శ్రీరంగవిభుఁ బ్రఖ్యాపించి యర్వదివేలమాడలద్దేవునుమ్మడికనొసఁగె"జై.౧.ఆ:

ఉమ్మడిన్.శ.అవ్య(ఏకకాలమున,యుగపద్గకము) "గీ. లేమవీక్షణమాలాశిలీముఖములు,శంబరారాతిశితసుమసాయకములు,గాటముగఁబర్వియుమ్మడిఁగాడుటయును"రసికె౩ఆ(ఇక్కడపూర్వకవిప్రయోగములయందొక్కశబ్దపూర్వకముగానే కానఁబడుచున్నది" పెక్కుబలంబులొక్కుమ్మడిఁద్రోచి,, ఇత్యాదులు.భార.ద్రో.౨.ఆ:)ఉఱక, ఉవ్వెత్తు,ఒకటన్,ఒకపెట్టు,ఒకపెట్టునన్, ఒకమొగిన్, ఒకయూకన్, ఒక్కంతగాన్, ఒక్కమొగిన్, ఒక్కయూకన్, ఒక్కుమ్మడిన్, ఒక్కూకన్, ఒక్కెత్తు,ఒక్కొటన్,ఒక్కొలనము, ఒక్కొలు,ఘురీనన్,ఘురీలునన్.

ఉమ్మనము. శ. వై= (ఉష్మ.ఊష్మము) చూ,౩.ఆవి.

ఉమ్మనీరు.శ.వై.చూ,ఉబ్బనీరు. [వి.

ఉమ్మలక.భా.౧.౭౭(ఊష్మము) చూ,౩.ఆ

ఉమ్మలము.1.శ(శోకము) చూ,౩.అడలు.

2.శ(దుఃఖము)చూ,౭.అంగద.

ఉమ్మలి.శ(పంకము)చూ,అడుసు.

ఉమ్మలించు.1.శ.అ.క్రి(దుఃఖించు) చూ,౧.అంగలార్చు.

2—(శోకించు)చూ,౭.అడలు.

3.భా.౩.౧౧౭.స.క్రి(వేష్టించు) చూ,౨.అరికట్టు. [౩.ఆవి.

ఉమ్మలింపు.1.భా.౧.౭౭ (ఊష్మము)చూ,

డు మెచ్చులుగొన్న మేటిసేనని పొగ
డంగవచ్చు" య.౧.ఆ:
2.శ.వై (ఐకమత్యము) ఒరిమిక
ఒరిమిక.శ—వై— [న్నవాఁడు
ఒరుఁడు.1.శ.వై.స(అన్యుఁడు)చూ,౧.ఉ
2.శ.వై.స.చూ,౩.ఒకఁడు [ము)
ఒరుదల.శ (పైశున్యము, కొండెకొని తన
ఒరుదలకాఁడు.శ(పిశునుఁడు) చూ,ఇల్లా
మల్లి
ఒరుము.శ.అ.క్రి(కలయు)
ఒరువుఁడు.1.శ.వై.స (అన్యుఁడు) చూ,౧.
ఉన్నవాఁడు
2.శ.వై.స.చూ,౩. ఒకఁడు
ఒఱ.1.శ(నిఱోశము) గనీబు,గవుసెన, గలీ
బు,గవిసెన,గౌసెన
2.శ(ఖడ్గాదికోశము)
3.శ(బావియొఱ) ఒఱపెంకు
ఒఱకటము.1.శ (సంకటము) చూ,ఆనరు
2.శ(విషమము)ఒఱకొటము, ఒఱగడ
ము,ఒఱగడ్డము, జేసి
ఒఱకము.1.శ(పల్లము,నిమ్నము)"క. నెఱ
వై దట్టంబైకనె,దెఱచినఁగను మూసి
కొసిన తెఱఁగై తిమిరం,బొరకంబిది మె
ఱకిదియని,యెఱుఁగనెరాకుండఁ జేసె
నెల్లధరిత్రిన్" సురా: కుంట, కుక్క,
గుంట,గుంత,నవుకు,పల్లము,పల్లు, పల్లు
డు,పల్కుడు,పొక్కిలి, బావి,లొట్ట,
లొత్త,వరఁత,నిత్రంత
2.శ(సంకటము) చూ,ఆనరు [టము
ఒఱకొటము.శ(విషమము)చూ,౨. ఒఱక
టము
ఒఱగడము.పా—వై—
ఒఱగడ్డము.శ.చూ,ఒఱకడము [అత్తమిల్లు
ఒఱగఁబడు.శ.అ.క్రి(అవనతమగు) చూ,౪
ఒఱగల్లు.పా.చూ,ఒరగల్లు
ఒఱగు.1.శ(ఉపధానము)చూ,ఆనుడుబిళ్ల
"ఒఱగుమీఁదటఁ జేరి,, క.శా.౫.ఆ:
2.శ (వంపు,వక్రిమము) చూ,౧ఈచ
3.శ.విశే (వంపైనది) చూ.౩ ఒరగు
4.శ.అ.క్రి(అవనతమగు) చూ,౪.అత్త
మిల్లు
5—చూ,౫.ఒరగు [ళ్ల
ఒఱగుబిల్ల.శ(ఉపధానము)చూ,ఆనుడుబి
ఒఱగుబిళ్ల.పా—వై— [౪.అత్తమిల్లు
ఒఱగుపోవు.శ.అ.క్రి(అవనతమగు) చూ,
ఒఱగొడ్డియము.శ(వక్రోక్తి)చూ,౧ ఒడ్డా
రము
ఒఱగొడ్డెము.శ—వై— [పొలము
ఒఱచాలుగుక్క.పా (ఒకమారు దున్నిన
ఒఱటు.శ(దుష్టుఁడు)చూ,ఆలరి
ఒఱపరి.శ (అలంకారి)చూ, అందగాఁడు
ఒఱపిడి.శ (ఘర్షణము) చూ,౧ఒత్తిడి
ఒఱపిఁడి.1.శ(అరోగ్యుఁడు)
2.పా (కుటిలుఁడు,శుష్కుఁడు) చూ,
అడిగొంటు
ఒఱపు.1.శ(తాపము) చూ,౨.అక్కసము.
2.అం.౨.౫.౨(మంజులము) చూ,౨అం
దము
3.శ(సౌందర్యము) చూ,౨.అంగము
4.శ(ఉపాయము)చూ,౨.అనువు
5.శ(ప్రతాపము) తేజు
6.శ(స్థైర్యము)చూ,౩.ఉక్కు
7.శ(యోగ్యత)
8.శ(దృఢము) చూ,౧. ఇట్టలము
9.శ.విశే(యోగ్యము) ఓగితము, దొన
రు,మంచి,లెస్స
ఒఱపులాఁడి.శ.చూ,అందగత్తియ
ఒఱపెంకు.శ (బావియొఱ) చూ,౩ఒఱ
ఒఱయిక.పా(ఘర్షణము)చూ,౧. ఒత్తిడి
ఒఱలు.1.శ.అ.క్రి(విలపించు) చూ,౭అడ
లు"సుతక్షిణుఁడొఱలి కేడసె,, భార.
ద్రో.౩.ఆ:

దొరకొనువిధమెట్లో,, భార.శా. 3ఆ:
6.శ.అవ్య (ప్రార్థనాదులను తెలుపు ను)"రండోసనవాసులార వినరో మును లారయనాథవాక్యముల్,, వీర. ౨ఆ:
7.శ.అవ్య (ఆర్తిని దెలుపును)"గీ. ఒ క్కడనుజాధముండు మొఱ్ఱోయనంగ, నన్నుఁ జెఱగొనిపోయెడు నన్నలార,, భార.ఆర.౫.ఆ: [లోచల్ల"
8.శ.అవ్య (అమ్మటను తెలుపును)"చ
ఓంద్రడ.శ (గాడిదకూఁత)
ఓండ్రడించు శ.అ.క్రి (ఓండ్రపెట్టు)
ఓఁక.శ (పుల్లకలివెఁ)ఓఁకలివె.
ఓకర.1.శ.వై (ప్రచ్ఛర్ది) ఓకరింత, ఓకలింత, ఓకిలి, ఓకిలింత, కక్కుడు, క్రక్కు, గ్రిక్కుర, చలది, డోఁకు.
2.శ.వై (రోఁత.నిందం)చూ, అగడాయు.
ఓకరించు.1.శ.వై.అ.క్రి (ఓకరవచ్చునట్లు మియు)ఓకిలించు, డోఁకు.
2—చూ, అసహ్యపడు.
ఓకరింత.1.శ.వై.(రోఁత, నింద)చూ, అగడాయు
2.శ.వై.చూ, ౧.ఓకర
ఓకలింత.1.పా.వై.చూ, ౧ఓకర
2.శ.వై (రోఁత, నింద)చూ, అగడాయు
ఓఁకలివె.శ.చూ, ఓఁక
ఓకిలి.శ.వై.చూ, ౧ఓకర
ఓకిలించు.శ.వై.అ.క్రి.చూ, ఓకరించు
ఓకిలింత.1.శ.వై.చూ, ౧ఓకర
2.శ.తద్భ.చూ, అగడాయు
ఓగాత్యము.శ.వై (అమంగళము) [ఇది వాడుకలోనిది] [చూ, ౯.ఒలవు.
ఓగితము.శ.వై=(యుక్తమె.యోగ్యము)
ఓగిరము.శ.వై=(ఆహారః.అన్నము) ఓమటి, ఓయిరము, ఓరెము, కూడు, దోమటి, పసాదము, బువ్వ, బోనము, మెతుకు, మెదుకు, వంటకము, సాదము.
ఓగు.1.శ (అశుభము)" ఓగుదానవచ్చు,, చూ, 3.అఱ. [గో.,,
2.శ.విశ(అశుభమైనది)"అది ఓగో బా
3.శ (మూర్ఖుఁడు)చూ, ఉక్కుఁడు" ఓగునోగు మెచ్చు,, వే.
ఓగులాడుచు.శ.అ.క్రి (దీనత్వమునొందు) దేవురించు, దైన్యపడు.
ఓచెల.శ.అవ్య (సంతాపార్థకము)చూ, ౭.అంగద
ఓచెల్ల.శ.అవ్య—పై—
ఓజ.1.శ.వై (భయము) చూ, అంజిక
2.శ (స్వభావము) పాడి, సబాము, సాజము [చూ, ౧.అయగారు
3.శ.వై= (ఓజః, ఉపాధ్యాయుఁడు)
4.శ (ఆజ్ఞ)చూ, అప్పణ
5.శ (విధము)చూ, ౧.అంగము
6.శ (క్రమము) చూ, ౨.ఉద్దవడి
7.శ.వై=(ఓజః, ఉత్సాహము)చూ, 3 అంగద
ఓజపడు.శ.అ.క్రి (క్రమపడు)
ఓజబంతి.శ.వై.చూ, ఒజ్జబంతి
ఓజు.పా (స్వర్ణకారుఁడు)చూ, అగసాలి
ఓట.1.శ (భయము)చూ, అంజిక
2.శ (సంకోచము)చూ, 3. అరవాయి
ఓటమి.1.శ (భయము)చూ, అంజిక
2.శ (భంగము)చూ, రవెడురు
3.పా (అపజయము)చూ, ఇఱుగుట
ఓటము.శ (అపజయము)చూ, ఇఱుగుట.
ఓటఱు,శ.అ.క్రి (నిస్సత్త్వమగు)ఓటాఱు.
ఓటాఱు.శ.అ.క్రి—పై—
ఓటి.పా (విముఖ్యత) [వాయిగొను
ఓటిల్లు.శ.అ.క్రి (సంకోచించు)చూ, ౨.అర
ఓటిల్లుచిందఱ.శ.చూ, అందలముఱు
ఓటు.1.శ (అపజయము)చూ, ఇఱుగుట
2.శ (భంగము)చూ, రవెడురు
3.శ.అవ్య (పరిశ్నార్థకము)చూ, ఊఁ"

దు) తక్కువగు, తగ్గు, తఱుగు
2. పా. వై. అ. క్రి = (అపసరః) చూ, ఉజ్జగిల్లు
ఓసరిల్లు. శ. వై. అ. క్రి = (అపసరః) చూ, ఉజ్జగిల్లు "క. ఓసరిలిపఱచు మృగ ములనేసికొను" భార. ఆది. ౪ఆ:
ఓసరు. శ. వై. అ. క్రి = (అపసరః) — వై —
ఓసి. భా. 3. ౭౨. అవ్య. చూ, ఒసి
ఓహటము. శ (వెనుదీయుట)
ఓహటించు. శ. అ. క్రి (అపజయమొందు) చూ, ౧. అయినుపది చేయు
ఓహటిల్లు — పై —
ఓహరి. పా (అహమహమిక) ఓహరిసాహరి
ఓహరిసాహరి — పై —
ఓహరిసాహరిన్. శ. క్రి. విశే. అవ్య (తండోపతండముగా "ఓహరిసాహరింబ్రిధమమొత్తెడుధారల" ఆము. ౪ఆ:
ఓహో. 1. శ. అవ్య (సంబోధనము నందు వచ్చును) చూ, 3. అల "ఓహోతక్షకక్రిమ్మఱుము" భార. ఆది. ౨. ఆ:
2. శ. వై. అవ్య = (అహో. ప్రశంసనార్థకము) చూ, 3 అజ్జ "సుగ్రీవస్గంబు లోహో యనన్" కళా. ౧. ఆ:
3. శ. అవ్య (ఏమీ) "సీ. పిలువ కుండంగ నైనం బలుకునోహోయనిబయలూంతగొనంజూచుబౌర సాచి" కవిక. ౪. ఆ:
ఓహోరె. శ. అవ్య (ప్రశంసనార్థకము) చూ, 3. అజ్జ. "మత్తకోకిల. ధారతప్పక చెప్పనేర్తువుదార వాక్చతురత్వమో, హోరెనాంగబ్రబంధ మొక్కటియొక్కనాటనే" సమీ. ౧. ఆ:
ఓహోరే, — పై —

ఔ

ఔ. ఒకయక్షరము. శ. అ. క్రి. చూ, అగు

ఔన్. 1. శ. అవ్య (అంగీకారార్థకము) చూ, అగున్
2. శ. అవ్య (ప్రశంసనార్థకము) చూ, 3 అజ్జ "ఉ. అయ్యారె బలంబుధాటి బళి యౌనినుంచువవీరులేచుగన్" చంద్రా. ౨. ఆ:
ఔకొంపు. శ (అర్ధాకొంపురము) చూ, అవుకొంపు
ఔంగదే. శ. అవ్య (ఆశ్చర్యార్థకము) చూ, ౪. అక్క "సీ. ఔంగదే లావణ్యమౌంగ దేవమాధుర్యమౌంగ దేసవి సనమౌవనంబు" సం. "అహోరూపమహోధామ మహ్యాహో అస్యావపుః" భాగ. ౮. స్కం
ఔంగాక. శ. అవ్య (అట్లేకాని) చూ, అవుంగాక
ఔగాములు. శ చూ, అవుగాములు (కలిమిలేములకు — "క. అనవయ్యంగననాకే, మనోహరన్నయదిమీరలనికంతేనుంజె, ల్లనమీకౌగాములు చెల్లనుపోయింబోకటికొనంబడునంటాంకన్" క. శా. 3. ఆ: యుక్తాయుక్తలకు — "గీ. దీని యౌగాములన్నియుం దెలిసికొత్తు, నేయ దేవే లెడుమహీనాయకునకుం గాని యుపరులకు దిలెంబుకాను" సం. 3. ఆ: మేలుకీళ్లకు — "క. చను నేమాయవ్వంగ తోకయుడె, ననయముననుగునల్లుమకె నవౌగాములెంగిన్" య. 3. ఆ: ఇచటయొకౌనాకను నేక వచనాంతముగాను గానంబడియెడి)
ఔంగు. శ (భృత్యవిశేషము) చూ, ఆంగొల్లెలు
ఔజు. 1. శ (కుల్యా; కాలువ) చూ, ౨. అవుజు
2. శ (కర్తృకోయుండు) చూ, 3. అవుజు "షనిహాం పెంగాభాసిలువాజన" అం. భా. ద్వి. హా.
ఔటుగుండు. శ (చట్టిపర్యంకిగుండు) [వుడు
ఔడు. 1. శ. వై (ఓష్ఠాధరభాగము) చూ, ఆ.
2. పా. వై (దంతెము) పళ్లు, పల్లు

కుప్పలము ..., ...ంగుండలికలు గనుపట్టఁ
దోఁడిగి,, రామా॰

2.సా॰. చూ॰, ఉంగ

3.సా॰(ధ్వనివిశేషము) చూ॰, అసురుసురు

కంగేలి.శ.వై(అశోకము) చూ॰, అసోకము

కంగోరు.శ(నిడుపుకొప్పె) కంగోరు పాపిడి

కంగోరుపాపిడి.సా॰——పై——

కంచ.సా॰(స్వేదనీభేదము)

కంచము.1.శ.వై(పాత్రము) తబుకు, నగ, పళ్లెము, పళ్లెరము, పస్యము

2.శ.వై(భోజనపాత్ర) కోరి, చాకీ, చాకి, తట్టు, తప్ప, తలియము, తళిగ, తళియ, తెలి, తెలియము, తెటె, బోనపుటిక, హరివాణము

కంచర.శ.వై (కంచుపనిచేసి బ్రతికెడు జాతి)

కంచరగాడిద.శ.తద్భ. చూ॰, కంకరగాడిద

కంచరవాఁడు.సా॰.తద్భ (కాంస్యకారుఁడు) కంచరి

కంచరి.శ.తద్భ——పై——

కంచి.1.శ.తద్భ(కాంచీపురము)

2.శ.విశ(పెద్ద) చూ॰, ఉక్కిడము

కంచిమేఁక.శ(పెద్దపొదుగులయొకదినుసుమేఁక)

కంచియ.1.శ(వివీతము) కంచె, కర, కొరక, కొరన, కొటఁకు, కొటను, చెలిక, చెల్క, దొడ్డి, పొలము, బీటిసేల, బీడు, లంక

2.శ(వృతి) కంచె, కట్లువ, తడుకు

కంచు.శ.తద్భ=(కంసమ్, కాంస్యము)

కంచుకంటు.శ(కందువు) బాణలి

కంచుపెమ్మారము.1.సా॰.చూ॰, అరజాట్టు

2.సా॰.చూ॰, ఉడుపకుక్క

కంచుమించు.1.సా॰.చూ॰, అడుబా

2.శ(అగోచరము)

కంచె.శ.చూ॰,1.2కంచియ [ట్టు, తెట్టువు

కంచెకోట.శ(ప్రాచీనము) కంపకోట, తె

కంచెగోడ.శ(కంపపాతినగోడ) కంపగోడ, కొట్రిగడ

కంచెల.శ.వై=(కంచుళీ, కంచుకము) "కంచెలలెగిసడ్డ" స్వా,౫.అ: కుపసము, కుప్పసము, చనుకట్టు, చనుఁగప్పు, చనుముటువు, చన్నుఁగప్పు, చన్కట్టు, పంజరవికె, రైక, అయిక, అవిక, రైకె

కంజు.శ.వై=(కపింజలః) కముఁజు, కయజు, కవుఁజు, కయిదు, కైజు, కైదు, కాఁజు

కంట.1.శ(నాట్యబంధము) కట్టరము, కట్టారము

2.శ(కనుట)

కంటకము.1.శ(విరోధోక్తి) "దగడ. అతిమిసనుజిగురునకునగునె కంటకమాడ" స్వా,3.అ: కంటసము, కచ్చె, పగటు

2.శ.విశ(విరుద్ధము) "తరల. కడఁగిబుద్ధి బలంబుఁదద్దయుఁ గంటకంబుగఁజేసి,, భార.అర,౬.ఆ: [ఈరసించు

కంటగించు.1.శ.అక్రి(విరోధించు) చూ॰, 3.

2——(నొచ్చు) కంటగిల్లు, నొగులు, నొచ్చు, నోయు, మ్రిందు, వేసరు, వేసారు

కంటగిల్లు.శ.అ.క్రి.చూ॰, 2. కంటగించు

కంటలము.1.శ (చిల్లరసరకులుంచి యొద్దు మొదలగు వానిమీఁదవేసెడుసంచులజత) కంటాళము, కంట్లము [ము

2.శ(దూదిమూట) కంటాళము, కంట్ల

కంటసము.శ.చూ॰, 1. కంటకము [లు

కంటసరి.శ.వై=(కంఠసరః) చూ॰, అడ్డిగ

కంటాణి.సా॰ (కొగిద పుస్తకములు కుట్టుకొను సాధనము) కంటాళము

కంటాళము.1.శం——పై——

2.సా॰.చూ॰,1.2కంటలము

కంటికలక.1.సా॰.చూ॰, అయిర

2.సా॰(నల్లగుడ్డు)

కంటితుద.1.సా॰(కటాక్షము)

2.సా॰(నేత్రాంతము)

రా'' విజ.౧.ఆ: కందువము

3.శ(ఏకాంతము) చూ,౧.ఏకతము "గీ. ఇందు వదనయున్న కందువ కేతెంచి, పొంచినిలిచి" విక్రి.౧.ఆ:

4.శ(జాడ) చూ,ఆమూకి "వ. అచ్చోటి పెద్దలవలనగందువ యెఱింగిచని" కాశీ.

5.శ(సంకేతస్థలము) "క. కందువ చోటి కిఁగొనిపో, వం బారసుగుటయు" భార.

6.శ(ఋతువు) "సీ. వానకందువలదివా రాత్రములు జలధార బయఁబులఁదడిసి యుండి" సర్వ.౩.ఆ:

7.శ(ప్రదేశము,స్థానము) చూ,౨.ఇక్క "క. ఈ,లోక మునసృష్టిచరితం, బేకందువ నైనఁగలదె" నిర్వ.౧౦.ఆ:

8.శ(సామర్థ్యము) "వ. సామర్థ్యంబు సేయువాఁడు లేమికవిపాదంబునొందిన నీ కందువ నైరంధ్రి చెప్పినంబ్రి యుంబంది" భార.విరా.౪.ఆ: కందువము, చదురు, చాలిక, చాలుబడి, చెతురు, నలువు, నేర్మి, నేరుపు, నేర్పు, పగ్గియ, పగ్గె, పస, పసిక, పోహణ, బంటవలము, బండాలము, మెఱవడి, లావు, వలను, విన్ననువు, విన్నాణము

కందువము. పా చూ, ౨. ౘ: కందువ

కందువాఱు.శ.అ.క్రి(మలినమగు) "అరవిందవిరోధియుఁగందువారె" కా. ౨. ఆ: మాఁగుడువాఱు, మాఁగువడు, మాఁగువాఱు, మాయు, మైలపడు

కందువు.శ(బిడ్డ) చూ,అడ్డపట్టుపాప [సి]

కందెన.1.శ(బండియిరుసునకుఁబూసెడుమ

2.పా(బండికన్నులయందుబట్టించుచమురు)

కందెఱ.శ(పక్ష్మము) కనురెప్ప, రెప్ప, ఱెప్ప

కంప.శ(కంటకాదిభారము) చూ,౧.ఈఁడిక

కంపకోట.శ. చూ,కంచెకోట

కంపగోడ.శ.చూ,కంచెగోడ

కంపతోఁచుగు.పా(రెండుకాళ్లతోఁజేర్చి తో లెడికంపపోగు)

కంపపులుఁగు. పా(కుక్కుభము,అనగాఁ కాకోకళకుంప పక్షి) గంపపులుఁగు, గబ్బు, గబ్బులుఁగు, జిబ్బు

కంపరము.శ(ఖాది) కటుగు, కటువు, పాడె, బడిసె [లుగుడు

కంపిలుగుడు. పా (భస్మగర్భ*) కంపుటి

కంపిల్లము.శ.తద్భ=(కాంపిల్యః*)

కంపు.1.శ(గంధము) "చనదిటులంటకంపెలుఁగఁజాలదు నాసిక" భార.ఆశ్వ.౨. ఆ: [వాడుకయందు దుర్గంధమని చెప్పుదురు] గంపము, గబ్బు, గవులు, గౌలు, ఘ్రాఁత, వలపు, వేసు

2.పా(ఘ్రాణగంధము) గమురు, గబ్బు, గవులు, గౌలు, చెడుకంపు, పుస్తు, బూజు, శేసు, విస్తు

కంపుటిలుగుడు. శ. చూ,కంపిలుగుడు*

కంపుధుమ్మ.శ(విట్ఖదిరము*) తెల్లతుమ్మ

కంపె.శ (తాంబూలపాత్రము) కుంపె, కుప్పియ, కుప్పె, జాలవల్లిక, తబుకు

కంపెలుక.శ(గంధమూషిక) చుంచు, చుంచెలుక, చుండు, చుండెలుక, చెంచు, మూఁగెలు

కంబడి.శ.తద్భ=(కంబళిః) కంబళి, గొంగడి, గొంగళి, గోరుపడము

కంబమయ్య.శ(స్తంభోద్భవనృసింహస్వామి) కంబముగాయఁడు

కంబము.1.శ.తద్భ=(స్తంభః) కుందె, కూచము, గడ, గుంజ, గూటము, గూటాము, నిట్ట, మొకరము, మొక్కరము, రాటు

2.శ(మల్లపరికరవిశేషము) కటిక, కట్టెక, కోణత, కోణతము, కోణిత, నీలిగోతాము, బాలసంగడము, మోఁదు, లోడు, లోడీ, సంగడము

బడియిట్టులాడు చెల్ల,నతని విజయము సందియమనుట గాదె'' సం. ఇత్యుక్త్వః కుపితో రాజా మత్స్యః పాండవ మబ్రవీత్'' భాగ.విరా.౧.ఆ:

2.—(బాధపడు) చూ, కక్కసపడు

కటకటా. పా.అవ్య (సంతాపార్థకము) చూ, 2.అంగద

కటకటాలు.శ.బ(ఇనుపకమ్ములు లోనగువానిచే నేర్పఱచెడియడ్డు) కటకటాకమ్ములు

కటకటాకమ్ములు—పై—

కటకరము.శ.తద్భ=(గంధర్వః, గంధర్వమృగము)కడంతి,కడఁతి,కణఁతి [క్కుళ్లు

కటకసరులు.పా(ధాన్యవిశేషము)చూ,అ

కటపెట.శ(ఒకరయుటయందగుధ్వన్యనుకరణము)చూ,అసురుసురు [అంగద

కటా.శ.అవ్య(సంతాపార్థకము)చూ,2.

కటారి 1.శ.తద్భ=(కటారః)కటారు, కటారి,చుర,చురకత్తి,చురి,చురియ,చూర,చూరకత్తి,చూరి,చూరీ, తేగాకత్తి, పిడెము,బాఁకు,సురియ,సురె [డిదము

2.శ.తద్భ=(కటారః,ఖడ్గము) చూ,అ

కటారికత్తియ.శ.తద్భ(కటారిగల అఁడుది)కటారికత్తె

కటారికత్తె—పై— [డు)

కటారికాఁడు. శ. తద్భ (కటారుకలవాఁ

కటారు.1. శ. తద్భ =(కటారః.ఖడ్గము) చూ,అడిదము'' చ.భర్తయున్,శరమొకటేసి తెత్రిక్కక వెసన్నిగుడన్ నలికెం గటారునన్'' ఉ.రా.2.ఆ:

2.శ.తద్భ (కటారః) చూ,౧. కటారి

కటిక.1.శ.తద్భ (వేత్రహస్తుఁడు) కటికవాఁడు,కటివాఁడు,కట్టిక,నకీబు, పడికాత్త,పడివాఱుఁడు,పణిహారి,పణిహారుఁడు,బిరుదులవారు,రికట్టలు

2.శ.తద్భ= (ఖట్టికః, మాంసికుఁడు) కటికవాఁడు,కసాయి, సూనగాఁడు, సూనరి

3.పా.తద్భ.చూ, అంగజాల

4.పా.తద్భ.చూ,౨.కోంబము

కటికచీఁకటి.పా(అంధతమసము) చీఁకు, పెంజీఁకటి

కటికమెకము.శ.తద్భ= (ఖడ్గమృగః) [క

కటికవాఁడు.1.భా.౨.గరగ.చూ,౧.కటి

2.పా(శూద్రుఁడు అనఁగా శూద్రస్త్రీ వైశ్యులకు గాంధర్వ వివాహమువలన బుట్టినవీథిచివర ధూపసమునమ్మువాఁడు) చూ,౨.కటిక [ములు''కటికినవ్వు''

కటికి.1.శ(అధికము) చూ,ర. అంకహొంక

2.శ(కఠినము)చూ,ర.కక్కసము ''కటికిసేల''

3.శ(సాంద్రము) చూ,ర.అచ్చము''కటికిచీఁకటి''

4.పా(దృఢము)చూ,౧. ఇట్టలము

5.పా(కఠినుఁడు)కట్టడి,గడుసరి,గొంటరి,పరుస, బెట్టిదుఁడు, బెడిదుఁడు, మల్లకుఁడు,మొక్కటీఁడు

కటివాఁడు.పా.తద్భ.చూ, ౧. కటిక

కటుక్కు.శ(కొఱుకుటయందగుధ్వన్యనుకరణము) చూ,అసురుసురు

కటుగు.పా(ఖాటి)చూ,కంపరము

కటుమరలు.శ.బ(హనువు,చెక్కిళ్ల మీఁది భాగము)పడఁతి

కటువు.శ.వై=(ఖాటిః) చూ,కంపరము

కట్ట.1.శ. చూ,౧.ఎక్కుము [అంగద

2.శ.అవ్య(సంతాపార్థకము) చూ,2,

3.శ(చెఱువులోనగువానికట్ట)సారువ

కట్టకడ.శ (అన్నిటికిఁగడ)తుట్టతుద

కట్టడ.1.శ (నియమము) కట్టడి,గరువతనము, నేమకము, నేమము,బవిస్తి,బైసి

2.శ(తీరు.విధము)చూ,౨.అంగము ''ఒడలికట్టడయమ్ముఖ, శ్రీరామ సీత

2.శ(బంగారుతూనికగుండు)కల్లె, ప డికట్లు

కల్లెు.శ.చూ,౨.కట్లెము [రి

కతారి.పా.తద్భ=(కతారః)చూ,౧.కటా

కత్రిల్లు.శ(పాతియుండగు ధ్వన్యనుకరణము) చూ,ఆసురుసురు [స

కడ.1.శ,తద్భ=(కాష్ఠా,దిక్కు)చూ,౧.అ

2—(స్థానము)చూ,౨.ఇక్కు

3—(దూరము)చూ, ౪,ఎడ"వ.పాంి ణ వల్లభుండు స్నపనంబున కరిగికడన యుండి పరికించి"కళా.౪.ఆ:

4—(నికటము)చూ,౨.అంచ" వివేక శూన్యులకడనుండెడునంత కంటెఁగష్ట ముఁ గలదె,,ఆము.౩.ఆ:

5—(పార్శ్వము)చూ,౧.అంక "సీ. హయముక్రిొల్లుకుసోయనిరెండుకడ లందునాగెనట్రిదుత్స్వాత్స్పతులు"క ళా.౭.ఆ: [గుదల,ముసు

6—(అంతము)కడపల,తుద,తుది, తె

7.శ.తద్భ.విశ(అంత్యము)

8.చం.తద్భ(మరణము)చూ,ఈలుట

కడంక.1.పా(ఉద్రేకము)చూ, ఒడికార ము

2.పా(స్థైర్యము) చూ,౩. ఉక్కు

3.పా(యత్నము)చూ,ఆయతము

4.పా(సాహసము) చేతాఁకు, తెంపి, తెంపు, తెగువ

కడక.పా(శిరఃపార్శ్వము)కడఁత,కణఁత

కడఁక,శ(యత్నము)చూ, ఆయతము

కడకన్ను.పా(కటాక్షము)కడగన్ను, క్రీ గన్ను

కడకాళ్లు,పా(చరణాంతము)

కడను.పా(కదంబము)కడప,కడమ,కడి మి,కడిమి,కొరవి [అంటగు

కడకుఁబోవు.శ.అ.క్రి(బహిష్ఠయగు)చూ,

కడకొఅవి.శ(ఉల్క)కొఅకన్ను,కొఅవి

కడగండ్లమారి.శ.చూ, అగచాట్లపోతు

కడగండ్లు.శ.బ.చూ,౨.అగచాటు

కడగట్టు.శ.స.క్రి(నిర్ణయించు) గుఱించు, నేటుసేయు, పాలుపెట్టు

కడగన్ను.శ.చూ,కడకన్ను [గావించు.

కడఁగు.శ.అ.క్రి(యత్నించు)చూ,౧.అం

కడగొట్టు. 1. శ. అ. క్రి (మరణించు) చూ,ఇలుగు"మ: కడసెన్ దుష్పలుడిం కవేసెనెలుఁగుల్ గిట్టెన్ బులుల్ సింగ ముల్ కడగొట్టెన్,,సా.౧.ఆ: కు"

2.శ.విశ (కడపటి)" కడగొట్టుకొడు

కడచను.1.శ.అ.క్రి(మరణించు)చూ, ఇలు గు.

2—(వశించు)చూ,౪.అడఁగు. [వు

3—(సమాప్తమగు)చూ,౧. అయిపో

4.శ.స.క్రి(తరించు) చూ,౫. ఈఁదు" క.వననిధినవలీలంగడ, చనువానిప్రసా దమొంది" రా.కిష్కి.౦.కాం.

కడచు.1.శ.అ.క్రి(మరణించు) చూ, ఇలు గు"క.జటాయువీల్గెను, ఘనుఁడాదశ రథసఖుండుకడచె నెయకటా" రా.కి ష్కి.౨.కాం.

2—(గతించు)"క.చింతింపకుకడచిన పనికి"కడతేఱు,కడవఁబడు.

3—(వశించు)చూ,౪.అడఁగు" సీ.అ లివేణివదనచంద్రామృతంబునఁగాని క డచునే మోహాంధకారభరము" భాను. ౪.ఆ:

4—(మేరమీఱు)" జలధులుప్పొంగి కడవఁగ" మార్క.౨.ఆ:

5—(అధికమగు)చూ,౩.ఎచ్చు" క.వ డిగల్గిహంసగతికిం,గడవఁబఱచువారు ను"భో.౫.ఆ:

6.శ.స.క్రి(తరించు)చూ,౫.ఈఁదు"గీ. అలసుమంతుని వీడ్కొనియర్కువంశ, ఘనుఁడుగంగాతరంగిణిఁగడచి" రామా

లు,కలిమిచెలి,కలుములచెలి,కలువలజో
నితోఁడు,జగముతల్లి,జన్నుకడలిబిడ్డ, త
మ్మిబిడారంపుగరితమిన్న,తమ్మియింటి
గరిత, తల్లితల్లి,తొలితల్లి,నెలచెలియలు,
పంటకలంతితోఁడికోడలు, పయిఁడినె
లఁత,పల్కులచెలియత్త,పాలమున్నీటి
తూఁకురు,పైఁడిసెలఁత, మగనిపేరెద
నున్నవగలాఁడి,మున్నీటిచూలి, లక్కి
మి,లచ్చి,లిబ్బిపడఁతి, వలరాజుతల్లి, వె
న్నుపెదకొమ్మ,సత్తికెచ్చెలి,సిరి.

కడలిఎత్తలికకుసేదారి.ప.౧.౧౦. (శివుఁ
డు)చూ,అంగములవేల్పు.

కడలిమీఁగడముద్ద. వెం. ౧౧ (చంద్రుఁ
డు)చూ,ఎదగందు.

కడలియల్లుఁడు సాం.౧.౪(విష్ణువు)చూ,
అడుగుచెమ్మటలాఁడు

కడలిరాతత్తడి.ప ౬.౪౦(మకరము)మరుని
డాలు,మొసలి.

కడలి తేఁడు.శ(వరుణుఁడు) చూ,ఏటిబో
టిమగలఱేకిమీఁడు.

కడలిలోనీరుదాఁగెడి వేఁడి.వెం ౭౪.(బడ
బాగ్ని)నీరుచిచ్చు, నీర్చిచ్చు,మున్నీటి
యగ్గి,వార్వపుటగ్గి.

కడలివెన్న .శ చూ,ఎదగందు [డిది

కడలివెలఁది.పా(దేవగంగ) చూ,అంచలవి

కడలు.శ(వీచి)చూ,అక్కలి.

కడలుకొను. 1. శ.అ.క్రి(అతిశయించు)
చూ,౭.అడరు. [ప్పొంగు

2—(మిక్కిలిసంతోషించు)చూ,౩ఉ

3—(వ్యాపించు)చూ,౪.అడరు.

కడల్కొను.శ.అ.క్రి(వ్యాపించు)చూ,౪
అడరు.

కడలొత్తు శ.అ.క్రి—పై—

కడవ.శ.వై—(కటాహా,ఘటము)కడువ,
నీరుమోపరి [ము.

కడవతీటు.శ(వాద్యవిశేషము)చూ, ఉరు

కడవఁబడు.శ.అ.క్రి(గతించు) చూ,౨.కడ
చు.

కడవసము.శ (చర్మము) కడాసము, కళవ
సము,కళాసము,తోలు.

కడవాఁడు .1.శ(అన్యుఁడు)చూ,౧.ఇన్న
వాఁడు

2.శ(కనిష్ఠుఁడు)తంబి,తమ్ముఁడు,తమ్మ
వాఁడు,తుదివాఁడు, వెనుకటివాఁడు.

కడవెళ్లు.1.శ.అ.క్రి(సమాప్తమగు)చూ,౧.
అయిపోవు.

2.శ.స.క్రి (తరించు)చూ,౫.ఈఁదు.

కడసరము.శ.చూ,అదుజా.

కడసారి.పా(తుదిపూఁట)

కడాని.శ.చూ,అపరంజి.

కడాసము.శ.చూ,కడవసము.

కడి౦ది.1 పా(మిగులకఠినమైనది)

2.భా.౨.౭౪ చూ,౧.కంతి.

కడి.1 శ(వాసన)పసి,పొలపము,వలపు.

2.శ(కబళము)తెరలి,ముద్ద. [నద.

3.శ(అల్పుఁడు,అధముఁడు)చూ,౨.అ

4.శ(క్షతి)గంటి,గంటు,గాయము, న
రుకు.

5.పా(పేడముద్ద)

కడికండలు.శ బ(ఖండఖండములు)

కడిగొను.శ.అ క్రి(కబళించు) చూ,ఎరగొ
ను.

కడితము.శ.వై(ఘుట్టించిననీలపటపులెక్క
పుస్తకము)కవిలియ,కవిలె.

కడితి.శ(గోకర్ణమృగము)చూ,కడంజు.

కడిదలుఁగు.ప.౧.౧౬. (చక్రము) చూ,
కంటిపాలు.

కడిఁది.1.పా(కష్టము)చూ,౨అగబాటు.

2.భా.౨.౨౨౧.(శౌర్యము)చూ,౪.అ
గ్గలిక.

3.పా(స్థూలము)చూ,౬.ఒడ్డు.

4.శ(ఆపద)చూ,౨.అంకిలి.

పుల్కాలు, మిసాలు

గగుర్పాటు.శ.(రోమాంచముకలుగుట) గగుర్పాటు,గగురుపాటు,గగుర్పొడుపు,గగురుపాటు

గగురుపు.శ.చూ,గగురు

గగురుపొడుచు.శ.అ.క్రి.(రోమాంచితము గు)గగురుపాటు,నిట్రగమ్ము,నిట్టవొడుచు,నిడుపెండ్రుకవెట్టు,పులకరించు

గగురుపొడుపు.శ } చూ,గగురుపాటు
గగుర్పాటు.వెం.రర }

గగుర్పు.శ. చూ,గగురు

గగుర్పొడుపు.శ.చూ,గగురుపాటు

గగ్గ.1.శ.తద్భ(గద్గదిక) [వాయిగొను
2.శ.అ.క్రి(సంకోచించు)చూ,౨ అర

గగ్గుగు.శ.చూ,గగురు

గగ్గలకొడు.శ (ధాన్యమురాల్చిన కంకుల సమూహము)

గగ్గులు.శ(గింజలురాల్చినకంకులు)

గగ్గెర.శ(కంజరము*)నల్లగగ్గెర

గగ్గెరగడ్డ.పా(కంజరమునంప)

గగ్గోలు.1.పా(భయము)చూ,అంజిక
2.శ(క్షోభము)చూ,౩ అంకిలి

గగ్గోలుపడు.శ.అ.క్రి.(క్షోభించు)చూ,అక్కలిపడు

గచ్చ.శ.(యక్షాక్షి*)గెచ్చ,గ్రచ్చ

గచ్చకాయ. పా. (యక్షాక్షిశలాటువు)

గచ్చకాయాట.పా.చూ,అందలములు

గచ్చు.1.శ.(కాంతి)చూ,౧. ఔప్ప"క్రొత్తడు పచ్చపట్టునను గచ్చు లక్ష్మ్ము గైచలింప"హరి.పూ.౩. అ
2.శ.వై(గ్రస్తోకి) చూ,కొచ్చెమాటలు
3.శ (పూఁత)చట్టు,పట్టు
4.శ(గారపూఁత) "పసిఁడిగచ్చరఁగు.
అము: పూఁత

గచ్చుకొను.శ.స.క్రి (వాయురోగముమొదలగువానిచేతబిగిసికొను)పట్టుకొను

గచ్చులాఁడి.శ(బయటికి పొంగ్యరాలివలె నటించునట్టిస్త్రీ)చూ,అంచపూన

గచ్చువిచ్చగు.శ.అ క్రి (కార్య వైకల్యము గు)చూ,అలుకూడగు

గచ్చువిచ్చు .1.పా.చూ,ఆకుపూడు. [ము
2.పా (వ్యర్థ్యప్రము) చూ,అకటవికట

గజ.శ (పృథువు)చూ,౧ ఉక్కడము

గజగజ.శ (వణఁకుటయందగుధ్వన్యనుకరణము)చూ,అసురుసురు

గజనిమ్మ.శ (లకుచము*)పెపావు

గజను.భా .౧.౧౩౮ (కపటము) చూ, ఉక్కసము [సలాక)

గజము.శ (తుపాకికిమందుగట్టించెడియినుప

గజిబిజి.1.శ (సందడి) చూ,౩ క్రందు;"వారిగజిబిజికొంతచేరుపనువినంబడిన,, క
2.శ (క్షోభము)చూ,౩ అంకిలి
3.శ(పీడనము) చూ,అగుముడు
4.శ.విణ(కలఁగినది)గపిబిపి
5.శ.విణ(నలఁగినది)గపిబిపి

గజిబిజించు.శ.అ. క్రి (క్షోభించు)చూ,అక్కలిపడు [రికొండు

గజిముచ్చు.పా. (పెద్దదొంగ)చూ,ఎతుబ

గజ్జ.శ(తొడసందు,వంక్షణము) [ము

గజ్జి.శ.వై=(కచ్చా,తీఁటకుఱుపు) చిను

గజ్జియ.శ(కింకిణి)గజ్జె,చిఱుగంట,బదుజు,బురిజ,బుసుజ,మువ్వ,మూవ

గజ్జు.శ.తద్భ(మదము)చూ,ఆడిబీరము;"ఎ.కి.కాలకంధర వాహంబు గజ్జుఁరేఁగ,,

గజ్జరము.శ.తద్భ(ఖర్జూరః*) చూ,ఈబ్బలి

గజ్జె.శ. చూ,గజ్జియ

గజ్జెగొలుసు.శ(స్త్రీపాదాభరణవిశేషము) పాఁజేబులు

గటక.శ(పిండితోఁజేసినజావ)

గట్ట.శ.తద్భ (సిద్ధాన్నోటికిగట్టించెడుబిరడ)

గట్టన.శ.తద్భ= (ఘట్టనమ్,ఘట్టించుట)

గటి.1.శ(కఠినము) చూ,ర కక్కసము

2.శ.తద్భ=(గర్వి, గాంభీర్యము నుబట్టి కుక్కకియ్యబడినపేరు) చూ, అనుమంతి గాఁడు

3.శ.తద్భ=(గర్వి, గర్వముకలవాఁడు) "రాచబిడ్డయై యుండి గబ్బితనంబెఱుంగఁడు" ఉ.హర: నిక్కుఁబోతు, పులసరి, పొగరుఁబోతు, మురికొాఁడు

గబ్బి పము.పా (తైలపాయిక) గబ్బిడా, గబ్బిడాయి, గబ్బిరాయి. గబ్బిలము, గబ్బిలాయి, జిబ్బటీ, జిబ్బడాయి

గబ్బిడా. పా — పై —

గబ్బిడాయి.శ

గబ్బిరాయి సాం.౪.౧౧

గబ్బిలము.శ — పై —

గబ్బిలాయి.శ

గబ్బిలి.శ.(ముష్టి) గుప్పిలి, పిడి, పిడికిలి

గబ్బిసి.శ. (ఒకానొకమూలిక)

గబ్బు.1 .శ. (దుర్గంధము) చూ, ౨. కంపు

2.భా.౧.౧౦౬(గంధము) చూ, ౧కంపు

3.శ.వై=(గర్వః) చూ, ౧.అదటు "సీ. పచ్చిబంగారువుప్పలు చేయఁగారాదె గబ్బుమీఱినవీరిగుబ్బలందు" పాండు

4.శ.వై(మదము) చూ, ౨అవటు[లుఁగు

5.పా . వై(కుక్కుభము) చూ, కంపపు

గబ్బుచీకటి.శ.(గాఢాంధకారము) చిమ్మచీకటి, పాడిచీఁకటి, మసక, మసకన, మునిచీఁకటి, ముఱిచీఁకటి, ముఱిముఱి చీఁకటి [త్రి

గబ్బుచెంపమెకము.శ(పీనుఁగు) చూ, ౨ అ

గబ్బులుఁగు .శ. (కుక్కుభము) చూ, కంపపులుఁగు

గబుకము.1.పా. (స్థూలము) చూ, ౬ఒడ్డు

2.శ(అధకము) చూ ౪అంకపొంకములు

3.శ.(మనోజ్ఞము) "ద్విప. సింగముల, గమకమా సోపానగతుల నేర్పఱచి" రా

4.శ.(యుత్నము) "గమకమున నెదుర" యు. చూ, అయుత్నము [గమించు

గమకించు.శ.అ.క్రి(యత్నించు) చూ, ౧అం

గమగమ.శ. (వాసనకొట్టుట యందగుధ్వన్యనుకరణము) చూ, అఘుఘుఘుఘు

గమగమించు .శ.అ.క్రి (గమగమని వాసన కొట్టు) గమాయించు

గమనిక.శ(విధము) చూ, ౧ అంగము

గమాయించు.శ.అ.క్రి.చూ, గమగమించు

గమళ్లవాఁడు. పా(క్షత్రియస్త్రీకి శూద్రునకుంబొడమి అయిదువిధముల సారాయినమ్ము వాఁడు)

గమి.1.శ(సమూహము, వర్గము) చూ, అంటలు

2.శ(తఱచు) చూ, ౨.ఒత్తడము

గమికత్తె.శ (అంతఃపురము నందు కావలియుండుఆఁడుది)

గమికాఁడు.1.పా. చూ, కాక్రి

2.శ(అధిపతి) చూ, ఏకిమీఁడు

3.శ(దళపతి) చేరువకాఁడు, దణాయుఁడు, దణి, దణియు, దణొ, దళవరి, దళవాయి, దొర, పడవాలు, పడవాళ్లు, పడాల్లు, మొనకాఁడు, మోటుకాఁడు

4.భా.౨.౧౮౪(అల్పసైన్యాధిపతి) జంగిలి, జంగిలిగమికాఁడు, పడవాలు, పడాలు

5.శ(ముఖ్యజనుఁడు) చూ, ౪ అనుఁగు

గమికొను.శ.అ.క్రి((పోగువడు) "క. కాఱియగామటియుఁబఱపె గమికొనఁదూఘులో" హరి

గమ్ము.శ.(వానకొట్టుటయందగునకరణము) చూ, అసుసుసుసు [గ్యాళము

గయాళము.శ. (ధిక్కారపు మాట) గ

గయాళి.శ.(ధూర్తస్త్రీ) చూ, ౧. గట్టివా

గయాళించు.శ.అ.క్రి(ధిక్కరించి మాటాడు) గయ్యాళించు [లపా)

గయాళు.శ(సేద్యముచేయుటకుఁదగనివా

గాఁడిగఁడుగు.క.స.క్రి(సంచయనముచేయు)
గాఁడిద.క.తద్భ= (గార్దభః)గాడిద,గాలి
గాఁడు,చలువగుఱ్ఱము,రేవుజక్క—
గాడిదకాళ్లవాఁడు.క (సంజ్ఞావు) గాడిదె
కాళ్లవాఁడు,దొడ్డికాళ్లవాఁడు, పంగ
టికాళ్లవాఁడు, ముట్టికాళ్లవాఁడు, ము
డికాళ్లవాఁడు
గాడిదగడపర.క(పిండీతకము*) గాడిదెగ
డపర,చాగరాడి,చాగరాడివెలికి,చా
గలాడివెలికి,మంగ,మ్రంగ
గాడిదపులి.క.చూ,కొరసానికందు
గాడిదె.పా.తద్భ.చూ, గాడిద[ళ్లవాఁడు
గాడిదెకాళ్లవాఁడు.పా.చూ, గాడిద కా
గాడిదెగడపర.పా,చూ, గాడిదగడపర*
గాఁడిద్రిప్పొయ్యి.క (గాఁడిత్రవ్వియేర్పఱచిన
పొయ్యి)
గాడీ.క.చూ,కోలారుబండి
గాఁడు.1.పా.(గుదము)చూ,కుట్టెము
2.క.(కామమదము)
3.భా.3. ౧౨3.స.క్రి (నాటుటలోనగు
నాన్ని(గుచ్చు)గుచ్చు,తొలుచు,నాటు,
నాఁడు
గాడుపు.క.(వాయువు)చూ,౧.ఈఁదు
గాడుపుకొడుకు.1.పా.(హనుమంతుఁడు)
చూ, అనుముఁడు
2.పా (భీముఁడు)చూ,౧ కరువలిపట్టి
గాడుపుమాలి.క —పై—
గాడుపుపట్టి.క —పై— [న్కారి
గాడుపుమేపరి.క (సర్పము) చూ,కంటివి
గాడుపుసంగడీఁడు.క(అగ్ని) చూ,అంటని
జేజే
గాడ్పు.క(వాయువు)చూ,౧ ఈఁదు
గాడ్పుటరదపుదొర.సాం.౧.ర (మన్మథుఁ
డు)చూ,అంచయేనుఁగుమావంతు
గాణ.1.క.తద్భ=(గాయనః) గాణుఁడు,
పాటకాఁడు,పాటరి,బహుకాఁడు,ల
యకాఁడు,నీకారి [ణిగా,నీ
2.క.తద్భ= (గాయనీ,పాటకత్తె) గా
గాణి.పా.తద్భ= (గాయనీ)చూ,తె గాణ
గాణీ.క.తద్భ=—పై— [ణ
గాణుఁడు.క.వై=(గాయనః)చూ,౧ గా
గాత.క.చూ,అడుపు
గాతము.క.వై.చూ,౧.గవి
గాతి.క. వై(బండి)చూ,అరగింత"గీ.చిన్న
వాండ్రఁజంపితొడతులుగొని వచ్చు...
అంజియు గాతికొ అను"భల్లా
గాతుకలఁగు. క.అ.క్రి(భేదిల్లు)చూ,౧.ఎ
డఁబాయు"క. ఉరముఁ దన్నుచు గద
గొని మస్తకము గాతుకలఁగఁగఁ నడిచె
న్"జై
గాత్రము.క(స్థూలము)చూ,౬.ఒడ్డు
గాత్రవాలు.ప.సం.ర(అస్కందితము)మొన
గాలు
గాద.క(చెమట కొయులతెఅము) [ను
గాదము.1.భా.౨.౭౬(తృణము)చూ, కసు
2.భా.౨.౧౩౦.చూ,౧ కదుము
3.క(పైరులోనికసవు)
4.క(పద్మము)చూ,౨ అను"ఎ.గీ.గాద
ముకమాటుపడియున్న కొయఁబోతె"
గాదిలి.1.క(ప్రేమము)చూ,౧అంటు"గా
దిలితనయుఁడు"భార
2.పా(బంధువు) చుట్టము, చుట్టలు,చు
ట్టాలు,బంధుగు,బందుగుఁడు,బందువు,
బందువుఁడు,విందు
గాదె.క .వై(కునరాలము)చూ,కణఁజము
గానిగ.పా. (నూనెఁదీసెడి యంత్రము)
గానుఁగ, గానుఁగు
గానుఁగ.క.—పై—
గానుఁగపిండి.క .(తిలకల్కము)గానుఁగు
పిండి, గాన్గపిండి, తెలకపిండి,
తెలికపిండి
గానూఁగు.పా.చూ,గానిగ

3. పా. (ఘంటారవ*) గిలకచెట్టు, గిలగిచ్చచెట్టు, గిలగింతచెట్టు, గిలగిలచెట్టు, గిలిగిచ్చ, గిలిగిట్టు, గిలుగిచ్చ
గిలకచెట్టు. శ. చూ. 3 గిలక
గిలకబండి. శ (చిన్నచక్రములబండి)
గిలకరించు. 1. శ. స. క్రి (గిలకొట్టు) చిలుకు, తరుచు. తప్పు, త్రచ్చు
2—(మథించు) "సీ. దుగ్ధాబ్ధిగిలకరింతురనిలింపులుతొల్లి" రుక్మాం
3—(శబ్దించు) చూ, 1 ఉగ్గడించు "ఎ. గీ. సోలపునడపులనందియల్ గిలకరింప,,
గిలకొట్టు. 1. శ. స. క్రి (వ్రేళ్లతో కలచు)
2—(కుదిలించు)
3—(వ్రేళ్లతో ప్రణుకు) "సీ. గిలకొట్టి యుట్టచక్కిలిగిలి ఘనిపెట్టి కిలకొట్టిన వ్వాలయుఁజేసి" చంద్రా
గిలగింతచెట్టు. భా. ౨. 43. చూ, 3. గిలక*
గిలగిచ్చ. భా. ౨. 43 —పై—
గిలగిల. పా. —పై— [నసుగిలిపోలేదు"
గిలి. శ. (భయము) చూ, అంజిక "పులిపోయి
గిలిగించు. శ. స. క్రి (గిలిగింతపెట్టు)
గిలిగింత. శ. (అన్యకరస్పర్శముచేతఁగలిగెడుచంకమొదలైన యంగములసంకోచము) గిలిగిలింత, చక్కిలిగింత, చక్కిలిగిలి
గిలిగింతచెట్టు. శ. చూ, 3 గిలక
గిలిగిచ్చ. శ }
గిలిగిట్టు. పా } —పై—
గిలిగిలింత. శ. చూ, గిలిగింత
గిలుక. భా. ౨. 43. చూ, క్రౌర
గిలుకు. 1. పా (శబ్దము) చూ, అలికిడి
2. శ (మొట్టిలులోనగువానియందగుధ్వన్యనుకరణము) చూ, అసుకుసూరు
గిలుగాడుట. పా (దొంగిలించుట) గిలుబాడుట, ముచ్చిలుట, దొంగిలించుట, దొంగిలు
గిలుగిచ్చ. పా. చూ, 3 గిలక*
గిలుకుపలుకు. శ చూ, కూకిపలుకు
గిలుబాడుట. పా. చూ, గిలుగాడుట
గిలుపు. శ. వి. క్రి. చూ, 1 గిలుపు. "అచ్చలులు విధునకుంగన్న గిలిపి,, రామా
గిలుబాడు. శ. స. క్రి. చూ, ర. అంకించు
గిలుబు. శ (అపహరణము. చౌర్యము) గిలుబుకోలు, గిలువు, చేవాఁడి, తెక్కలి, దారము, దావరము, దావా, దొంగతనము, దొంగపని, దొంగతీకము, దోఁగురు, దోఁపడము, దోఁపిడి, దోఁపు, దోఁపుడు, పచ్చియము, పచ్చెము, బందిపట్టు, బందిపోటు, మోస, మోసము, ముచ్చిమి, ముచ్చిలి, లంకింపు, వల్లడి
గిలుబుకోలు. పా. చూ, గిలుబు [ర అంకించు
గిలుబుసేయు. శ. స. క్రి (అపహరించు) చూ,
గిలుబుకొను —పై—
గిలువు. పా. చూ, గిలుబు
గిల్లకన్ను. శ (మెల్లకన్ను)
గిల్లచూపు. శ (మెల్లచూపు)
గిల్లు. 1. శ (నఖక్షతము) గిల్లుడు
2. శ. స. క్రి (నఖక్షతముచేయు) చిదుము
3—(ఆకులులోనగువానిగోయు) చిదుము
గిల్లుడు. శ. చూ, 1 గిల్లు
గివులు. 1. శ. స. క్రి (గీఱు) గీఱు, గోఁకు, చీఱు, జీరు, బరుకు, బఱటు, మక్కు, అక్కు
2—(భేదించు) గీఱు, చిందఱసేయు, చిందఱలుసేయు, చిఱుమట్టాడు, వింగడించు, వెంపరలాడు, వ్రచ్చు
గిసరి. పా. చూ, కేసరి

## గీ

గీ. శ. అవ చూ, గి. [దీర్ఘాదియైన: — "జేవుఁడు,, "గీవుఁడు" "వాలి,, "గీలి,, "సాత్యకి,, "గీత్యకి,, మొ
గీఁక. శ. తద్భ = (ఘీంకారః) చూ, కీక

గీసు.శ.స.క్రి(కత్తిలోనగువానిగీచు)గోఁకు
గిచు.శ.స.క్రి.చూ,గిచ్చు [గు
గీఱుమొఁగు.శ. అ.క్రి(మరణించు)చూ,ఇలు
గీటుపెంగుట.భా.౨.౨౨౫. చూ,ఈల్గుట
గీటు.1.శ(రేఖ)గీఁత,గీఱ,గాఱ,గోఁటు,చా
లు,చీరము,జీర,రేక, అక్కు, వ్రాయి
2.పా(అనాదరము)చూ, ఒల్లఁబోక
గీఁటు.1.శ.స.క్రి(పండ్లు కొఱుకు)
2—చూ,౧ గిఱు ప్ర"క.కనుగీటినభ
గునిఁబట్టికన్నులుపెకలించె,,భా౯
3—(చిమ్ము) "కన్నునీరు గీటియతని
పై,ధూళివెసదుడిచి,,వాసి [ఎగ్గించు
గిటనఁబుచ్చు.శ.స.క్రి (అనాదరించు)చూ
గీట్లుపిద్ద.శ (కౌశికములలోనగు వానియం
దుగీట్లువేయు నుపయోగించెడుకోల)
గీఁత.శ. చూ,౧ గీటు
గీఁతకట్టియ.శ (పడ్లవాఁడుగీతలుగీయుటకు
పయోగించెడుపలక)గీఁతకట్టె
గీఁతకట్టె.శ—పై—
గీపెట్టు.1.భా.౧.౧౨౧(ఆర్తరవము)
2.శ.అ.క్రి(ఏనుఁగుకూయు)
3—(మొఱపెట్టు) చూ,౨ కూయు
4—(శబ్దించు) చూ,౧ ఘీంకరించు[గీఁ
పెట్టుయిదియిట్లుండుటయుక్తము]
గిము.శ.తద్భ=(గృహమ్) చూ,౧ ఇక్క
గిము.శ.స.క్రి .చూ,గిచ్చు
గీరణగింజ.పా. (రేఖికా బీజకేళి)గీరనఁగిం
జలు,గీరనగింజలు
గీరనంగింజలు.శ.బ—పై
గీరనగింజలు.శ.బ—పై—
గీఱ.శ.చూ,౧.గీటు
గీఱు.శ.స.క్రి.చూ,గివ్వు
గీఱు గాజులు.శ.(ఒకవిధమయినగాజులు)
గీఱుడు.1.శ.(గోఁకుడు)
2.శ.(ఛేదనము)
గీఱుసామము.శ. (గీఱగిచినసామము) "సీ.
కేఁ జుఱుచెప్పులుగొప్ప గీఱసామములు
మొలఁజెక్కుఁగత్తులు నిలువుపిగలు"
నీలా
గీలు.శ.అ. క్రి.(స్రవించు)చూ,౨. ఊట్టు
గీలుకొనుట.పా(అభిముఖముగుట)గీల్కొ
నుట [గీల్కొల్పుట
గీలుకొలుపుట.పా(పుష్పాదులధరించుట)
గీల్కొనుట.పా.చూ,గీలుకొనుట
గీల్కొల్పుట.పా.చూ,గీలుకొలుపుట
గీవు.శ(తాకట్టు)చూ,అగావు[అపి]

గు

గుంజ.1.శ.పై(స్తంభము)చూ,౧.కంబము
2.పా.పై.చూ,కట్టుగొఱ్ఱు
గుంజనుసుగు.1.శ. స. క్రి (పరిహాసముచే
యు)చూ,౧ అడకించు
2.శ. (ఎలుఁగుగొడ్డాట)
గుఁజిలిపెట్టు.శ.స .క్రి(గోపనముచేయు)
గుంజిళ్లు.పా.(నతి)చూ,ఎరఁగుడు
గుంజిళ్లుపెట్టించుకొనువేల్పు.పా. చూ,ఇ
ద్దరుతల్లులముద్దుబిడ్డఁడు [వు మొదలు)
గుంజు.1.శ(తాడుఈఁదులోనగువాని మో
2.శ (తాటితేగ మొదలయందు బుఱ్ఱ
లోనుండెడుగుజురు)
3.శ.స.క్రి(ఈడ్చు)
4— చూ,ఊతుకు [బిల్లిగొను
గుంజులాడు.శ.అ.క్రి(పెనఁగొను)చూ,అల్లి
గుంట.1.శ.తద్భ=(కుంభమ్.పల్లము)చూ,
౧ ఒఱకము
2.శ.తద్భ=(తటాకము)చూ,౨ కుంట
3.శ.తద్భ=(అల్పతటాకము) చూ,3
గుంట [కుంట
4.శ.తద్భ= (కుండమ్.సరసి) చూ,౧
5.భా.౩.౨౩3.తద్భ. చూ, కొంపి
6.శ.తద్భ=(పిఱిఁదిమీఁదిగుంట)గుంత

గుటుకుగుటుకు. పా — పై —

గుటుక్కు. శ — పై — [ఇలు గు

గుటుక్కుమను. శ. అ. క్రి (మరణించు) చూ, [మెట్టు

గుట్ట. 1. శ. వై = (కంఠః. పర్వతము) చూ, కరువ

2. శ. వై = (కుఠకః. చిన్నకొండ) తిప్ప,

3. శ. వై (రాశి) చూ, ౧. ఉద్ది

గుట్టు. 1. శ (మర్మము) చూ, ఆనవులు

2. పా (గాంభీర్యము) పేరిమ

3. పా (తాత్పర్యము వలయు పుచ్చుచు)

గుట్టుంజేడు. శ (రాజతంత్రముబయలుపడుట)

గుట్టుసాక్షి. శ. వై (వాదికనవ్యవహారము గెలుచుటకొఱకు రప్పింపఁగావచ్చి దాఁగియుండి ప్రతివాదియొక్క మాటలన్నియుఁ జక్కఁగావిన్న సాక్షి) [ది

గుటిక. 1. శ. వై (బెంకొయుబిళ్ల లోనగున

2. శ. వై (బిడ్డలకు పాలుపోసెడు చిన్న శంఖము) పొరడ, పొలడ

గుడాకు. శ. మి. గ్రా (బెల్లముతోఁ జేర్చిమర్దించినపొగాకు)

గుడారము. శ. వై (గుణాలయః, పట గేహము) గుడారు, గూడారము, గూడారు, గొటిజ, గొల్లియన, గొల్లెన, చప్పరము, చప్రము, డేర, డేరా, దేరిజ, దేరిజ

గుడారు — పై —

గుడి. 1. శ (పరివేషము) చూ, గాలిగుడి

2. శ (వలయాకారపురేఖ) [పుటెంకి

3. శ. వై (దేవాలయము) దేవళము, కోలు

4. భా. ౨. ౧౩. చూ, ౧. కోయిల

గుడికట్టు. శ (గ్రామము, నాలుగుదిక్కుల యెల్లలయేర్పాటు)

గుడికొను. శ. అ. క్రి (వ్యాపించు, క్రమ్ము) చూ, ర. ఆదిప॰ క. ఒడలఁ గుడికొనుచుమ్మఁడు తుడిచి కొనుచుం జనియె న్"పాంచా

గుడిగి. శ (పోఁకొలివఱకుఁ దొడిగికొనుచస్త్రీకవచము) చెడ్డి

గుడిగుడి. శ (అల్పము) చూ, ౧. అన్నవ "ద్వి. గుడిగుడికన్నె దగుగ్రుక్కుచు" హరిశ్చం

గుడిగుడిగుంజము. పా. చూ, అందలములు

గుడిచుట్టు. శ (పరివేషము) చూ, గాలిగుడి

గుడిజెల్ల. శ (మత్స్యభేదము) చూ, అయిపక్కుర [గు)

గుండిదిరుగు. శ. అ. క్రి (గుండ్రముగా తిరు

గుడిసె. 1. శ. వై = (కుటీ. కుటీరము) గుడుసు

2. శ (చించాఫలము)

గుడిసెపాటు. పా (కులట) చూ, అంటకది

గుడిసెవాటుది. భా. ౨. ౧౧౭ (కువేశ్య) లంక

గుడుక్కు. శ. చూ, గుటుకు

గుడుగుడు. శ (పసుగాత్తుటయందగు ననుకరణము) చూ, అసురుసురు [ములు

గుడుగుడుగుంచములు. శ. బ. చూ, అందల

గుడుగురావిలము. శ (పక్షివిశేషము) చూ, అంబటికోరిగాఁడు

గుడుప. పా. చూ, ఇనుపదుడ్డు

గుడుసరి. శ (కపటముగలవాఁడు)

గుడుసు. 1. శ (పరివేషము) చూ, గాలిగుడి

2. పా చూ, ౧ గుడిసె

3. శ (వస్త్రలము) చూ, ౨ ఉంట "సీ. గుడుసైనపూవింటఁగూడికమ్మనితూపు కటకొముఖపుఁ గేలఁగరము మెఱయు,, నై

గుడుసుకయిదువు. శ (విష్ణుచక్రము) చూ, కంటివాలు

గుడుసుపడు. శ. అ. క్రి (గుండ్రమగు)

గుడుసువాలు. శ. చూ, కంటివాలు

గుడెము. ప. ౩. ౩౦ (పక్కణము) గూడెము, గోడము, గోడెము, వేఁటపల్లియ, వేఁటపల్లె

గుడ్డ. 1. పా (వస్త్రఖండము) చూ, గుంజె

2. శ (వస్త్రము) చూ, ఒలె

గడ్డము.శ(క్షేత్రము,చేను)చూ,౨. అవ

గడ్డాము.1.శ—పై—

3.పా(చేనుతునక)

గుడ్డి.1.పా(అంధుఁడు)చూ,౨.అవిటి

2.శ(అట్టచేమ్మతోఁటలలోవెలికిలఁ బడ్డ ఒంటికాయ) [చూ,కాయకంటి

గుడ్డికళోపాదుసా.వెం.౧౫(కుబేరుఁడు)

గుడ్డికొక్కెర.పా(కోయష్టికము)గుడ్డికొక్కెరాయి,గ్రుడ్డికొక్కెరాయి, చీకుకొక్కెర

గుడ్డికొక్కెరాయి.పా—పై—

గుడ్డు.పా(అండము)గ్రుడ్డు

గుడ్లగుబ్బలి.పా(ఘూకము)చూ,3కొరడు

గుడ్లగూబ.పా—పై—

గుణపడు.శ.మి.అ. క్రి. (యుక్తమగు, చక్కఁబడు)చూ,౪.అత్తు

గుత్త.1.పా(వస్త్రము)చూ,౭.౭

2.శ.వై=(గుప్తమ్.ఫలప్రదమైనయొక సొత్తునుఆసొత్తుగలవానికి తత్ఫలార్ధము తగినధనమిచ్చితినయనుభవమున నుంచుకొనుట)మక్తా

3.పా.వై.చూ,ఇజారా [ఁడు

గుత్తకాఁడు.శ(గుప్తికారుఁడు) పాలెగా

గుత్తగ.పా.వై.చూ,ఇజారా

గుత్తగొను.శ.స.క్రి(గుత్తయెత్తు)

గుత్తము.1.శ.వై.చూ,కచ్చితము

2.శ.వై(బిగువు)బింకము,బిగి,బిగువు,బిఱ్ఱ,పొడి,లవణి

గుత్తవా.పా.వై.చూ,ఇజారా

గుత్తి.శ.వై=(గుచ్ఛః)చూ,౧. కుచ్చు

2.శ.వై(గుల్మము)గుది,చీలమండ, మండ,శిలమండ

గుత్తికగువ్వ.శ(కపోతాంఘ్రి) గువ్వగుత్తి,గువ్వగుత్తుక

గుత్తికవ్వము.శ(వెదురుకొయ్య చివరను చీల్చిదారముతోఁగట్టి యేర్పఱచిన కవ్వము) [దుఒకవిధమైనపండ్లు)

గుత్తిపండ్లు.శ.బ(గుత్తులుగుత్తులుగాపండె

గుత్తిమల్లెలు.శ.వై.బ.చూ,అడవిమల్లె

గుత్తులుగుత్తులు.పా.బ—పై—

గుత్తులు.పా.బ—పై—

గుత్తివడు.శ.అ.క్రి(ముకుళించు, ముద్దుఁగు)చూ,౧.కొరగించు" గీ.కొన్ని దేశంబులివమచేగుత్తివడియె" కాశీ [డ్చు)

గుదగుదలాడు.శ.అ.క్రి (దగ్గుత్తికతోనే

గుది.1.శ(గుచ్ఛము)చూ,౧.కుచ్చు

2.భా.౨.౧౨౫.చూ,౨.గుత్తి [ము)

3.శ(ఆకులులోనగువానిగ్రుచ్చిన సర

4.పా(పశుబంధరజ్జువు)

గుదికోలు.శ(పాశిణి)గుదిగాలు,మడమ

గుదికూర్పు.శ(గుంఫనము)

గుదిగఱ్ఱ.శ(దుష్టమగుగోవు మొదలుగాఁగలవానికి మెడనుగట్టెడుకొయ్య) గుదిగఱ్ఱ,గుదె,దుడ్డు,దుడ్డు

గుదిగాలు.పా.చూ,గుదికోలు

గుదిగుంజలు.శ.బ(పసులదొడ్డి లోనగువానిద్వారమందునిలువుగాఁబాఁతినకంబము)

గుదిగొను.1.శ.అ.క్రి(అతిశయించు)చూ,2 అపరు

2—(దట్టమగు)

3—(మూటకట్టుగాఁగూలఁబడు)

గుదిత్రాడు.శ(దూడకాలికిఁగట్టుత్రాడు)

గుదిత్రోయు.శ.స.క్రి.చూ,అడుగంటాటించు "క.నా,హృదయమునొప్పించితివిఁక గుదిత్రోసెద నేఁడునిన్నఁగొంకక యుచటన్" హరిశ్చ

గుదియ.1.శ.చూ,గుదికఱ్ఱ

2.భా.౨.౨౧౬.చూ,ఇనుపదుడ్డు

3.శ తద్భ=(గదా,నాలుగుమూరల్లుని డివిగలదండము)

గుదియకఱ్ఱలు.శ.బ(గుదిగుంజలకడ్డముగాఁ

